# వివిధకుసుమావళి

## ప్రథమగుచ్ఛము



(కవి)

కవికొండల వేంకటరావు బి. ఎ., బి. యల్.,

శ్రీరంగపట్టణము



ప్రకాశకుఁడు :—

గాడిచర్ల రామమూర్తి, రాజమహేంద్రవరము.

మూడవకూర్పు

నరసాపురం

సీతారామా ముద్రాక్షరశాల ముద్రితము.

1930.



విద్యార్థులకు 0—8—0 ఇతరులకు 0—12—0

# భావానుక్రమము

# మూడవకూర్పునందుద్బోధ



అచిరకాలములోనే యీపొత్తము మూడవ కూర్పునందఁగలిగెనని యాంధ్రమహాశయులకు విన్నవించుటకన్న నెక్కుడుద్బోధ కాలహరణమేమో? అయినను గడచిన రెండు వత్సరములనుండియు నియ్యది ముఖ్యముగ మధ్యమోన్నత పాఠశాలలఁ బెక్కింటఁ బఠనీయగ్రంథముగ నుపయోగింపఁబడుచుంట నొకటి రెండు వాక్యము లాసందర్భమున సూచించుట విధి.

ప్రకృతి పురుషుల భేదములు. దేవుని బూజించుమను టెంతయో చెట్టును బ్రేమింపుమనుటయందును నంత విలువ కలదు. సత్యము వచింపుమను దానియం దెంత విద్యుక్తధర్మము నిర్వచింపఁబడుచున్నదో, పూలతోటలో నిర్విచారముగ విహరింపుమను దానియందు నంత విద్యుక్తధర్మము నిర్వచింపఁబడుచున్నది.

అట్టియెడఁ బ్రకృతిరామణీయకమగు కవిత మఱొండు నుత్కృష్టంబగు కవితనుండి యెంతమాత్రము భిన్నమైనది కాదు. తదభినివేశమును లేఁతమనస్సుల కెక్కించుటవలన బాలబాలికలు దమ చుట్టునుంగల ప్రకృతివిషయంబులందు సానుభూతియు సస్మైత్రియు చిఱుతతనంబునుండియు నలవఱచుకొందురు.

పైయాశయమును మన్నించి యుపాధ్యాయులు మున్నగువారు ఈ ప్రచురణమునింకను బ్రచారమునందుంచి ప్రోత్సహింతురు గాక యని నమ్ముచున్నారము.

---

## ఏతత్కవికృతములింకను నింతవఱకచ్చుపడి ప్రచారమునందున్నవి.

—:o:—

1. భావమురళి 0—4—0 [పాఠశాలల పఠనీయగ్రంథముగ నంగీకృతమయినది.

Approved for school use:-

2. కుమారకంఠము 0—4—0 [Approved for libraries and teachers]
3. ప్రకృతిచందనము 0—4—0 [ Do. ]
4. ఆత్మవ్యక్తి 0—8—0 [Approved for libraries]
5. నెలబాలుడు 0—12—0 [ Do. ]
6. పాట్టికత 0—8—0 [Approved for libraries]
7. జనపదములు 0—4—0
8. మాతృదేశ సంకీర్తనము 0—4—0
9. కలరుతము 0—4—0
10. ఆగడపలు 0—12—0
11. త్రయి 0—14—0
12. కోనేరు 0—4—0
13. చిట్టికైత 0—6—0
14. చదువులదుత్త 0—4—0

## రెండవ కూర్పున

# హెచ్చరిక.

—:0:—

ఈపొత్తము మొదటికూర్పు 1916 న ముద్రితమైనది. అప్పుడు కొలది ప్రతులు మాత్రమే అచ్చొత్తింపబడినందున జనసామాన్యమున కంతవిరివిగ నందకపోయినది. ఒక కొన్నియున్న నయ్యవి రాజమహేంద్రవరము, తణుకు, నరసాపురము తాలూకాబోర్డుల వారిచేతను నొకకొండటి పాఠకమహాశయుల చేతను కొనఁబడినవి.

ఇప్పుడయ్యది 24—5—1917 వ తేదీగల గెజెట్టున పాఠశాలల యుపయోగార్థమై యంగీకరింపఁబడిన దగుటచేతను కొందఱు మిత్రు లప్పుడప్పుడు తిరిగి ముద్రింపవలసినదిగ గోరియుండుటచేతను పునర్ముద్రణము చూడఁగల్గినది.

ఈపొత్తమునందలి గుణగణములు వేఱుగ నుగ్గడించుటకంటె సూచించి వదలుట పాఠకులయెడగల ఆత్మవిశ్వాసమునుబట్టి

17—7—1921 వ తేది నొక లేఖనుండి "——మీకవనము స్వభావసిద్ధమై రసములకిక్కయై మృదుమధుర వాగ్రచనల సొంపెసంగి——"

6-8-1921 వ తేదినొక లేఖనుండి "——Your book Vividhakusumavali has been recommended for use in Forms III & IV of High Schools by the Inspector of Schools—"

---

పొత్తములు వలసినచో,

కవికొండల వేంకటరావుగారు

నరసాపురము

పశ్చిమ గోదావరిజిల్లా.

అని వ్రాయవలయును.

# APPROVED FOR USE IN SCHOOLS

*Please Vide*

*Supplement to part I-B Fort St. George*

*Gazette dated 24th May 1927*

*Consolidated list of books........revised*

*up to 1—1—27 page 78*

**And part I B Fort St. George Gazette dated**

**9—4—1929 page 188.**

ఈ పొత్తము పాఠశాలలలో పెట్టవచ్చునని

టెక్స్టుబుక్కు కమిటీవారిచే

సంగీకరింపఁబడ్డది

**24-5-1927** ఫోర్టుసెంటుజార్జి గెజెట్టు 1-బి భాగము

సప్లిమెంటు చూడనగు.

మఱియు

9—4—1929 ఫోర్టుసెంటుజార్జి గెజెట్టు 1-బి భాగము

పుట 188

చూడనగు

---

# వివిధకుసుమావళి.

## 1 నిశ్శబ్దగీతిక





ఉ. ఊడుపుమళ్లనుండి తడియూటలుబిల్బిల నద్దు చెక్కులన్
వీడక జాలువాఱ దరిఁబెంపగుపచ్చిక కప్పిపుచ్చుటన్
వేడుకమైఁగనుంగొనుచు విశ్రమమందితి; నేమిముచ్చటో
యాడెడునద్ది కాఁపు తెలియన్ వలసీని రహస్యవైఖరిన్ 1

ఆ॥ వె. శిశువు ముద్దుమాట శిక్షింప వచ్చుఁబో
పొదలు దాని పలుక బోధితంబు;
కన్నెకలుకు నుడులు కామింపఁ జెలఁగుఁబో
పొదలుదాని పలుక మోహితంబు. 2

శా. ఆసక్తిన్ వినుకొద్ది నుండియును లేనట్లాచు నిశ్శబ్ద భా
షాసారస్వతమందు నైక్యమగు చాయవ్యక్తశబ్దంబున
న్నాసన్ దవ్వులఁజూడఁజేసెనొకచో నాకూడ్చు కేదారమున్
హాసప్రోద్బలులై శ్రమింపడు మతంగస్త్రీలధమ్మిల్లముల్ 3

కం. ఉన్నట్టుండియు వారలు
సన్నగఁ దమగొంతు లెత్తి సాగించిరిగా

పున్నెపుఁ బురాణపదమును
వన్నెలవిటకానిపాట వచ్చినవెల్లన్! 4

కం. కాలము వేగిరపడియెన్;
దేలికఁ గనిపించెఁ జేయఁ దీఅనిశ్రమముల్;
లీలగ రోదసి యయ్యెడ
వాలాయము వారిపాటఁ బాడుటె తోఁచెన్ 5

కం. పాటకుఁ గూలీయరు; తమ
పాటున కిచ్చెదరుగాని పాడెద రేమీ?
గాటపుఁ బ్రబోధమిడు చా
టోటులకది యొక్క సహజభూషణమేమో! 6

తే. సత్యమా నది ! యదియుఁ దజ్జలముభాతి
నిత్యనిశ్శబ్దతనుగూడి నెగడఁ దొడఁగె;
నేర్తునే యెన్నఁడేనిఁ ద న్నిజవిధాన
నాదు గీతిక నిశ్శబ్దమోదికాఁగ! 7

## 2 వృద్ధదాసి

ఉ. ఇంటివసారపంచ నును పెచ్చినఱోటను బెద్దవాయఁ బై
కంటనుబోసికొంచులవలల్లనరుబ్బుచుఁజుట్టుఁదోఁ్రియుచున్

మంటికి నెత్తుగా నిటు కమర్చుచు నుంశినవృద్ధదాసి తా
నొంటిగ నాత్మలో నెదియొ యోజఁగుమారిలు చుంటఁ
[గాంచుచున్. 1

మ. "ముసలీ! రుబ్బగ జబ్బ సత్తువ తనో? ముప్పూటలన్నంబునున్
పసిగాఁబెట్టుటమానిరో? యటులవిస్తారంబుగా బాష్పముల్
వెసరాలంగను నేడ్చె దేటికె" యనన్ వేవేగ మీఁజేతఁగన్
గోసలన్ బాపుచు నూర్పుఁబుచ్చి పనిచేకొంచిట్లు మా
[టాడెడున్. 2

ఉ. "నాన్నయగారు! ఏటికి వినంగను నాదగు చిత్రగాథ? యెం
దున్నది తీర్పలేరుకద; యుత్తము లెక్కుడో కానియుండరా
పన్నుల పాట్లు లెక్కఁగొనఁ; బ్రాతదియయ్యె నుగష్టజీవనం
బెన్నఁగ నాకు, నింకను నిసీ! యనిపించఁగ నేలనోటితోన్ 3

కం॥ కానీ, యడిగిన వారలు
కానన్ నోడువంగనగునుఁ గలిమిని గొన్నా
కైన యనంతర మకటా!
ప్రాణంబులు లేమినీడ్వ భారముకాదే? 4

ఉత్పలమాలిక

పుట్టిన దానదూరుపున బున్నెములచ్చియుఁదూగునయ్యకున్
బట్టిగ; ముద్దుముద్దుగను నట్టిలునంబెనుపంది, వస్తువుల్
పెట్టుక పెండ్లి మూడితిని బేరును మోసిన పెద్దకాఁపు; నా

పట్టిననోములీచుటనో? భర్తగతించెను గొన్నినాళ్లకే
కట్టెఁడిముండమోత ననుఁగానఁగనోపక నాదుబందుగుల్
పట్టున నొక్కయావనుని భర్తగఁజేసిరి వెండి:—వింత క
న్పట్టెడునేమొమీాకు, నలవైపునమాకొలమున్ మగండుపోఁ
బట్టిన నేడుమారులు వివాహముకానగునంట:-యింతటన్
బట్టణముల్ విదేశములు పాయక యిర్వురమట్టెమెట్టుచున్
గట్టివయస్సునంబడిన కష్టఫలమ్మును గూడవెట్టుచున్
బొట్టెలనిద్దఱన్ గనుచుఁ బొందుగఁగాపురమొక్కనాల్గునా
ళ్లట్టెటొపుచ్చఁగల్గితిమి; ఇంకఁబయిన్ దలకిందుకానకా
పట్టిన సుంతకల్మిని నభాగ్యత నాపతి త్రాగుడందులన్
దిట్టరి మాయనాసవతి త్రిప్పుల దీనను దాన నంతయున్
బెట్టి దరిద్రితన్ మిగిలి పేదరికమ్మున నన్నురోసి, యా
మట్టునెపోయెఁ; గొంపయును మాన్యము లప్పులుపాలు
[సేసె; నా

పొట్టను నేనుపోసికొనఁబోవిడిచెన్ ననుఁ; జిన్నికుఱ్ఱలన్
గట్టు! యటంచు మోసికొని కంఠమునందలి గుల్లగుట్రినే
గుట్టునదాచుకొన్నయవి కొంచునునమ్మక గౌరవంబునన్
గుట్టునఁబెట్టి చాలవఱకున్ జఱిగించితిఁ; బెద్దవాఁడు న
ట్టిట్టుఁ బొలంబుకూలిపని కేగుచుఁ దేఁగలవాఁడుకాఁగఁగన్
గుట్టెనొ పాడుదైవమునకున్ బడె నల్లవిషూచి, వానినిన్

బొట్టను వెట్టుకొంటిఁ దలపోసినఁ జెట్టువలెన్ గనన్ బడున్
బుట్టినదాది రోగ మొగపూట యెఱుంగఁడు కన్నతండ్రినా
పుట్టుక దేటికింక—నటుపోయినఁ జావక చిన్నివానినిన్
బెట్టుకయుంటిఁ బెచ్చుకొన వేళోక సాధన మేమిలేమినేఁ
డిట్టుల మీఱ దాసినయితిన్—గల యన్నిదినాలు శక్తిమై
గట్టునదాటగన్ దగదె? కాని కటా! యదియున్ జరాప్తిచే
మట్టుపడే విధమ్ముగను మానసమున్ వెఱపించుచుండె; నీ
ర్వట్టినయుల్వాలే నలుగుపాటవమున్ గనఁజాలకుంటి నిం
కెట్టి యవస్థ పట్టునొకొ? యెత్తగసేయునె బిచ్చమున్న నం
చుట్టిని నూగులాడుచును నూఱకె యేడ్చితిఁ గారణాంతరం
బెట్టిది లేదు లోపమనకే యిదువారలు మీరలన్నియున్ ”

కం. అనుచున్ జెప్పెడు లోపలఁ
 బని యయ్యోను నదియునంత బాబయగారూ!
 చనెద నటంచును బోయెను
 గనుజూపుల జాలి వెల్లిగా వెనుఁబఱగన్.

## 3 చంద్రగిరి

—:o:—

సీ. ఓమహాభవనమా! యే మహీశ్వరుఁడు నీ
 కొలువుకూటాన రంజిలినవాఁడొ;

కొలఁకుఁదామరలార ! చెలఁగు మీపయ్యెర
నే పట్టమహిషి కీర్తించినదియొ;
కొండబురుజులార ! కుశలత మీనుండి
యే సేన శత్రు వంచించినదియొ;
ఓదుర్గవప్రమా ! నీదు రక్షణమున
నే ప్రజ స్వస్థత నెసఁగినదియొ;

గీ. అట్టి వారెల్ల కాలాన మట్టు వడఁగ
మోడువడు మ్రాఁకు కారాకు జాడలట్లు
నేటికిని మీరు మిగిలి ర వ్వేటిపేరు
చంద్రగిరి వరపుర మని స్మరణసేయ. 1

మ. అకటా! లోఁతగుకందకంబిపుడు బైలై పోయె, నెత్తైన గో
డౌకచో నేలకుమట్టమయ్యె, ఘనహర్మ్యోత్తంసమామార్గగా
మికిమెట్టయ్యెను, సత్కవీంద్రనుతసంస్నిగ్ధంపుఁ బద్మాకరం
బు, కటా! వ్యాఘ్రసృగాలఘాతుకరుతిన్ మ్రోయున్ గదా
[సర్వదా! 2

మ. బలమెల్లన్ హనుమంతవిగ్రహతతిన్ బల్కంగ, సత్కీర్తిని
శ్చలపుంజమ్మును “నక్క”దేవతలఁబ్రస్తావింపరాజ్యంపుది
క్కులుతుంగాద్రిశిఖాగ్రమున్ బొగడ, మూకున్ దోఁచుఁగా
[కున్నవో
స్థలరాజమ్మ ! భవచ్చరిత్రమును గాసంతైన నూహిం
[తుమే,?

శా. అచ్ఛోటా విరమింతు నొక్కతుఱ్ఱిటి హృద్యంబానొ యే
[మైన; నె
మ్మచ్చున్ జూడ నశింపె కాసెబడు నమ్మక్కా ! యిటన్
[దక్కు, దా
విచ్చెన్ గొంపొకతమ్మిమొగ్గకొలనిన్; ఏచున్‌దరిన్
[బైరుగా
లచ్ఛంపుంబెనునీడ నోరగిఱుం బొర్చ్యాధారభూభృచ్ఛి
[లల్. 4

సీ. ముత్తియంపు ధవళిమద్యుతి తులకించిన
మారాజుకీర్తి యీతీరుఁ గలఁగె,
కనుజూపు నసమమై యెనసిన మారాజు
నేక ఖండంబెల్ల నిట్లుపగిదిలె,
స్వాతంత్ర్యఫలరాజిఁ బఱగిన మారాజు
కా పెల్ల నీతీరు రూపడంగె
లక్షకు లక్షలై రాగిల్లుమారాజు
భోగలక్ష్మి యిటులపూర్వ మడగె
గీ. వనఁగఁ దామరాకులనీరు తొణకులాడు
కొండరాల్ వానపాయుల కోతలువడు
నఖిల వృక్షాళిచెఱెడు ననన్యమైన
నళిని తూరుపుఁ బోల్కనుఁ దలఁప నింపు 5
తే. భూత కాలాంధకారంపు జ్యోతి యగుచు
వెలయు నిచ్ఛోట శేషించు కలిమి యొక్కఁడె

మిత్రి శీతాంశుమేఘ సుక్షేత్రి గణము
పంటపరిపాలనము లేనిపట్ల వ్యర్థలో! 6

శా. కన్నీరై ప్రవహించునీకనుమ మేఘుంబొండు వర్షించుచో,
నన్నా! రాననుకంపయెత్తునిటఁజాయల్ పొద్దుపొవంగ, శేఁ
జెన్నొ వెన్నెలకాపులింత్యటవిలోఁ జింతించుఁ, బత్నీ [ప్రతుల్
మన్నింపంగను లేరుగాయనుచు నీమన్నింబు జీర్ణించెదన్

# 4. వి యో గ ము

తే. ఏపు చూపెడుపచ్చిక యిక్కలందు
గోవులను మేపుకొనుచును గొంత సేపు,
దట్టమగు చిగురుటాకుల రొట్టఁగోసి
కోఁడెదూఁడల కిడుచును గొంతసేపు.

ఉ. కాలము వెళ్ళబుచ్చినను, గన్పడుచున్నది యింక నెంతయో
కాలము; దానినింగడపఁగా నెటేగింపుమి, ఎవ్విధాన? నీ
లీలలఁగాక నచ్చినచెలీ! దయసేయుము రమ్ము నాకు నే
వేళనుగూర్చుచుంటుతమి వేడ్కలనీ చెలువంపు చెయ్వులన్.

చ. నెలవెనుకొక్కనాఁడురమణీయపుఁబిల్లనఁగ్రోవిమ్రోతలన్
గలచు విచారముల్ పొడమఁగన్ నినుఁగోరికఁదీసికొంచుని

ర్మలసలిలమ్ముగ్రోలుచును మావిరసమ్ములఁజూఱలాడుచున్
మసలితిఁగాదె యెంతయును మానిని నీకదివిజ్ఞప్తియుండదో?

సీ. ఉపశిలోపరి భూషితోర్వీధరాగ్రంబు
లెట్టసంజలఁ గొసరించుచోట
తొగలమొత్తమ్ములఁ దులఁదూఁగు కొలఁకులు
లేఁతచంద్రికల లాలించు చోట
పెనఁగి వృక్షమ్ములవ్రేలాడులతలు ద
క్షిణగంధవహుని నూగించుచోట,
మాలతీచంపకమల్లి కాతతి పిసా
ళించుపూవుల నిజికించు చోట
భృంగశారికపికకీరబృంద మెల్ల
కెరలిదిగ్దంతములను మ్రోగించు చోట
చెందువలెఁ దూలి చెలరేఁగు చిట్టిజింక
యిచ్చఁగొఱికి పచ్చిక సవరించు చోట　4

తే. వేణునాదంపుఁ బలుచని తేనె లందు
సరస సల్లాప శర్కర శల్కలములు
మెదపి తీయముల్ కూర్చితిమే కరంబు
నంటి తిరిగెడు మధుపంపుజంట వోలె.　5

చ. విడిచితినిన్ను; నేవిరహవేదనఁ బొల్పడియుంటి నియ్యెడన్
వడబడుచుండుఁడాం కెనలదాసిలతల్ విఱువంగఁబోవు చోఁ

గుడుపఁగఁజాల లేఁగలను గోవులకున్ సరిగాఁగవిప్పుచున్
నడువఁగనేర పీళ్ళకుఘనమ్ముగదూరమటంచుఁదోఁచెదున్

సీ. మెలఁత! నీచిరునవ్వుఁ దలఁచు కొలందిని
జాబిల్లిడాలు సంజ్వారము గొలుపు
సకియ! నీకెమ్మోవి చవులనెంచు కొలంది
ఫలము లొక్కొకటి చప్పనగఁ దోఁచు
ముదిత! నీసుమదేహమును స్మరించు కొలంది
తలిరులపానుపు ములుకు నయెడు
వనిత! నీపలుకులు గణియించు కొలఁదిని
పక్షులరుతములు ప్రాఁతగిలెడు,
నెలఁత! నీతోడఁ గడపిన నెలను నెంచ
నీ దినాంతము లెల్లను వృథగఁ జెల్లు
తెఱవ! నీకూటమిని నొప్పు తీరుఁ జూడ
నొంటరిగ నిప్పు డేనిటనుంట, గలఁచు. 7

చ. పిదుకుదు నేను పాలు మఱివెన్ననుమీఁగడ నీవుతీయుచో
నుదయమె నేను దిగ్గిమ్మఱుదు నొప్పగ ముంతను నీవు
[మోయుచో
నుదకమునేను తెచ్చెదను నుష్ణ మొనర్చుచునీవుపోయుచో
ముదవతి!దంపతుల్ పనిసమంబుగఁబంచుకొనంగనయ్యెడున్

ఉ. గోపకుమారువెంబడిని గొండపొలమ్ముల గోలమందలన్

మేపుచుఁగాలమున్ గడపమేలెయటంచుఁదలంపఁబోకుమా
శ్రీపతియంతవాఁడయినఁ జెందఁగనేరఁడు మత్ప్రి మోద
[మున్
జూపఁగలేదుబ్రహ్మయినసుందరినావలెలోకచోద్యముల్

చ. చిగురులసెజ్జవైచెద,విచిత్రపుఁబూవులమాలలన్ మెయిన్
నగలుగనుంతు,గ్రోవిని ననారతమూఁదుచువిందుఁగూర్తునె
వ్వగలనుదీర్తుఁ, దీయనకుపఁష్టను జల్లని నీర మిచ్చెదన్,
సొగసుగఁజూపుచుండెదను జుక్కల మబ్బుల సూర్య
[చంద్రులన్ 10

తే. రమ్ము వేగమ్మువచ్చి సౌఖ్యమ్ములిమ్ము
నీవు రాకుండువేని ఓపూవుఁబోణి!
యాలకదుపుల విడిచి యివ్వేళ నేను
పయన మగుచును నిన్ జేరవలసియుందు. 11

---

# ౫ ఆర్యాంగనాస్వప్నము

—:o:—

కం. వేసవి నొక దివసంబున
గాసిలి సాయంతనమున గడుబడలికతోఁ
బూసెజ్జ నొడలు వాలిచి
యేసుఖమును గరము నిచ్ఛగించుచు నుండన్ 1

సీ. నెమ్మనఁగ్రమ్మిన చెమ్మట లాఱిచి
మందమారుతము లానంద మొసఁగ
నవయువతతి పడ్డ యలయికఁ దీఱిచి
మృదువైనపానుపు ముదముఁ గూర్పఁ
బవలెల్లఁజెందిన వడకొట్టు నడఁగించి
సాంద్రచంద్రిక కడు సౌఖ్యమిడఁగ
వ్యాపారమునఁగన్న వైకల్యమును మాన్పి
ధ్వనివిహీనస్థితి కునుకుఁ దేఁగఁ
గీ. అహాహ! కష్టులకెకద సౌఖ్యప్రదంబు
లంతకంతలై తోఁచెడు నంచు నెంతో
మదినిఁ దలపోసి గాటంపు నిదురఁజొక్కి
నన్ను నేను మఱచి యప్పుడున్న యెడల. 2

చ. లలితవిచిత్రముల్ గనఁదొఱంగితిఁ గన్నులఁ గట్టినట్టులన్
గలయనలేను సత్యమని గట్టిగ నొత్తి వచింప నేర; వేఁ
దలఁపఁగరావుపూర్ణముగ దాపఁగఁజాలను; నెమ్మనంబునన్
దెలుపుదుఁ గల్లవోనిజమొ ధీనిధులే తెలియంగ నయ్యె
ఆ॥ వె. సౌధరాజతతులఁ జక్కని బాటల [డు. 3
సుందరోపవనుల సొబఁగుమీఱి
చక్రవర్తినగరసరణిని బఱఁగుచు
వెలయునొండుపురముఁ దొలుతఁగంటి 4

సీ. నెమ్మనఁగ్రమ్మిన చెమ్మట లాఱిచి
మందమారుతము లానంద మొసఁగ
నవయవతతి పడ్డ యలయికఁ దీఱిచి
మృదువైనపానుపు ముదముఁ గూర్పఁ
బవలెల్లఁ జెందిన వడకొట్టు నడఁగించి
సాంద్రచంద్రిక కడు సౌఖ్యమిడఁగ
వ్యాపారమునఁగన్న వైకల్యమును మాన్పి
ధ్వనివిహీనస్థితి కునుకుఁ దేఁగఁ

గీ. అహహ! కష్టులకెకద సౌఖ్యప్రదంబు
లంతకంతలై తోఁచెడు నంచు నెంతొ
మదినిఁ దలపోసి గాటంపు నిదురఁ జొక్కి
నన్ను నేను మఱచి యప్పుడున్న యెడల. 2

చ. లలితవిచిత్రముల్ గనఁదొడంగితిఁ గన్నులఁ గట్టినట్టులన్
గలయనలేను సత్యమని గట్టిగ నొత్తి వచింప నేర; వే
దలఁపఁగ రావుపూర్ణముగ దాపఁగఁజాలను; నెమ్మనంబునన్
దెలుపుదుఁ గల్లదౌనిజమొధీనిఘులే తెలియంగ నయ్యె
[డున్. 3

ఆ॥ వె. సౌధరాజతతులఁ జక్కనిబాటల
సుందరోపవనుల సొబఁగుమీఱి
చక్రవర్తినగరసరణిని బఱఁగుచు
వెలయునొండుపురముఁ దొలుతఁ గంటి 4



కం. ఆపురి చెంగట నొక్కవి
లాపము వినవచ్చె దానిఁగ్రమమున వినుచున్
"బాపము! కొండొకమానిని
వాపోయెడు ననుచు జాలిపడుచును జేరన్.

సీ. అపరంజి పసిఛాయ నపహసించెడు మేన
వల్కలంబులు వింతవన్నె నెరప
శ్రీకారములమించి చెలువెలర్చెడు కర్ణ
ముల శిరీషము వింతమురువు జఱుపఁ
గంబుసౌందర్యంబుఁ గంకించు గళమునఁ
బూలదండలు వింతపొలుపు నిలుప,
నప్సరసాంగన నదలించు మోమున
శాంతభావము వింతకాంతిఁ బఱుపఁ

గీ. దనరు నిండుచూలాలి నాస్థలమునందుఁ
దనదు కేల్దోయి జోడించి వనటఁ బైకి
దృష్టిఁ దేలిచి కంఠంబు నెత్తియెత్తి
యేడ్చుచుండుటఁ గంటిని నెదుట నిట్లు 6

ఉ. "ఓయమ! మేనకా! కనుము యో! భవదీయసుతన్ శకుంతలన్
న్యాయమొకింతయైన నెడనారయకావరపౌరవాన్వయుం
డీయెడ వీడె నన్ను దయనీక్షణ సేయఁగదమ్మ వచ్చినన్
దీయఁగదమ్మ నీదరికి నింకెటు పోవను గణ్వపాలికిన్

మ॥ అలయార్తధ్వనినాలకించుచును నేనందేయటుల్ వింతమై
నిలువన్ ఖేచరమార్గమందుదిగుచున్ నేత్రోత్సవంబై శకుం
తల నత్యంత జవంబునన్ దివికి గంధర్వాంగనారత్న మిం
పలరన్ గొంచుఁ జనంగఁగాంచితిని మాయంబాయెనేమో

తే. ఆప్రదేశముదాటి యింకరుగుచుండఁ [యనన్
దాపసుల కాటపట్టయి తనరఁ దగిన
వనము నొకదానిఁ గాంచితిఁ గనులబండు
వయ్యె నద్దానిఁ జూచిన యంత నాకు. 9

కం. సమిధలు పర్ణంబులు స
త్సుమములు దర్భలు ఫలములు శుభ్రజలంబుల్
విమల తపోధనులుండఁగ
నమితములై వెలయుచుండె నవ్వన మందున్. 10

కం. అందందున్ విహరించుచు
ముందట నొక చెట్టుక్రిందఁ బూర్ణ శ్రమమున్
జెందిన పతితల తొడపైఁ
బొందిక నిదురించు వినరు పొలఁతిన్ గంటిన్. 11

మ. ఉపవాసశ్రమమెల్ల నామెవదనాంభోజంబు చూపించె, ధై
ర్యపుఁ జిత్తంబును నేత్రముల్ తెలిపె, దూరస్థానమే తెంచి [యం
దపతిన్ దద్దయు సేవ దేర్చుటలు తన్నారీమణిన్ బొల్చుదూ
రపుఁజూపుల్ మెఱయించె నిక్కము సతీరత్నంబనం జెల్లుగా!

మ: అలయార్తధ్వని నాలకించుచును నేనం దేయటుల్ వింతమై
నిలువన్ ఖేచరమార్గమందుదిగుచున్ నేత్రోత్సవంబై శశిం
తల నత్యంత జవంబునన్ దివికి గంధర్వాంగనారత్న మిం
పలరన్ గొంచుఁ జనంగఁ గాంచితిని మాయం బాయెనే మో
తే. ఆప్రదేశముదాటి యింకరుగుచుండఁ [యనస్
దాపసుల కాటపట్టయి తనరఁ దగిన
వనము నొకదానిఁ గాంచితిఁ గనులబంఢు
వయ్యె నద్దానిఁ జూచిన యంత నాకు. 9
కం. సమిధలు పర్ణంబులు స
త్సుమములు దర్భలు ఫలములు శుభ్రజలంబుల్
విమల తపోధనులాడఁగ
నమితములై వెలయుచుండె నవ్వన మందున్. 10
కం. అందందున్ విహరించుచు
ముందఱ నొకచెట్టుక్రిందఁ బూర్ణశ్రమమున్
జెందిన పతితల తొడపైఁ
బొందిక నిదురించు విసరు పొలఁతిన్ గంటిన్. 11
మ. ఉపవాసశ్రమ మెల్ల నామెవదనాంభోజంబు చూపించె, ధై
ర్యపుఁ జిత్తంబును నేత్రముల్ తెలిపె, దూరస్థానమే తెంచి
[యం
దపతిన్ దద్దయు సేవ దేర్చుటలు తన్నారీమణిన్ బొల్చుదూ
రపుఁజూపుల్ మెఱయించె నిక్కము సతీరత్నం బనం జెల్లుగా!



చ. అలసతి యెవ్వరో వినఁగ నన్యులకన్పడరైరి చిత్రమే!
యలఘుచరిత్రధర్మవిదుఁ డంద్రుజనుల్ నిను నాదునాథునిన్
దలపుమి సత్యవంతునిగ నన్గరుణింపుము ప్రాణదానమున్
జలుపుమటంచు లేచి చనసాగెను దక్షిణదిక్కు చూచుచున్.
తే. దానిఁగని శీలయెవ్వర్తో ధవుని జీవ
ములను ధర్మమంపు వడిఁ గొనిపోవుచుండ
ననుసరించుచునుండె నటంచు నెఱుఁగఁ
గల్గితినిగాని వెన్నంటగా వశంబె? 14
కం. మఱికొంతవడికిఁ దిన్నగ
నరుగఁగఁగ నెదుట నతిభయంకర మగుచున్
వెఱపున్ గొలిపెడు నొకయెడఁ
గఱకుశ్మశానస్థలంబు గనుగొనినాఁడన్. [నన్
చ. పొగలెగయంగ నంటుకొనఁ బోయెడు కాష్ఠములొక్కచోటు
సగము తగుల్పడన్ గొఱఁ సహ్యపు మొండెము లొక్క
[చోటఁ బూ
ర్తిగ నశియింప భస్మమయి రేగెడు నెమ్ము కలొక్కచోట నా
కగపడె నచ్చటెల్లెడల నర్థనిశీథని భీతి హెచ్చగన్.
కం. ఆచ్చట కొకసాధ్వీమణి
వచ్చి మృతుండయిన చిన్ని బాలుని మేనన్
జిమ్ముంచఁగఁగడుగుచు నె
మ్మచ్చునసంచు వెనుకాడ మాఱిఁగనుగొంటిన్. 17

ఉ. హా!సుత!లోహితాస్య!యిటులాడువటంచును నెంచనైతి నే
నేసమయంబునందుఁ దుద కెట్టియవస్థఘటించెధాతయం
చాసతి యెన్ని యోగతులనాత్మజురూపవిలాసమెంచుచున్
జేసెను రోదనంబుఁ గడుఁజెప్పగజాలను దానినియ్యెడన్.

తే. ఇంక నచ్చటేమేమొ నాదృష్టిఁ బడియెఁ
గాని సరిగను స్మరణకుఁ గానరావు
స్వప్నమగుటనునేమొ సర్వంబుఁదెలియ
నలవికాకుండె నాకిట నక్కటకట,!

కం. ఆరుద్రభూమిఁ గడవఁగఁ
జేరితి నేబోయిపోయి చిత్రింపుమహా
ఘోరవనంబున్ పక్షి
భూరుహతతి కుంజవితతి భూతఘనంబున్. 20

సీ. ఒకసీమ దావాగ్ని సకలంబు కాల్ప వే
ఱొకసీమ మధువు కోరకము తొడఁగు,
ఒకమూల వేటకాండ్రుచ్చులుపన్న వే
ఱొకమూల మృగజాతి యులివుఁగొలుపు,
ఒకచాయఁ గఠినకంటకములు విఱుఁగ వే
ఱొకచాయ పూలరాలిక లెసంగు,
ఒకవంకఁ బాము లూరకబుసకొట్ట వే
ఱొకవంక విహగంబులొనరఁగూయు,

నావనాంతరమందున నట్టి యిక్క-
నొక్కయెడ బెదరుపడుచు నొక్కయెడల
సంతసించుచు నడకలజటపి నాఁడఁ
జోద్యములనెల్ల కన్నులఁ జూచుఁగొనుచు 21

చ. అటనడయాడుచుండగ నెయుంగననోర్తునుగాంచఁగల్గితిన్
బోటబోటఁగాకననిప్పులుపోఁదుచువంగఁజెఱంగుదీసి "హా!
యెటువిడనాడిపోయితి మహీశ! నళా! యిదెరెండుచేసితే?
కట! కట! యిట్లు నన్నుఁ గడగండ్లను ద్రోసితెయాంచుఁ
[గుందఁగన్.

ఉ. ఎవ్వతె వీవవో! యిటుల నేటికి నొంటరివైతివింక? ని
న్నెవ్వరుపీడినారటువి? నెందుల దాన పటంచు నెన్నియో
యవ్వనితామతల్లిని రయమ్మున నేనడుగంగనుండినన్
రెవ్వన నాస్థలిన్ వడలి తెక్కలతో ననఁబోతి నెట్టులో.

ఉ. ఆపయినాగికాఁచిలి మహాబ్ధిని లంక నశోకవృక్షపుం
దాపున రాక్షసాంగనలు తప్పక కావలికాచుచుండ లో
లోపల, రామ రామ, యనిపోఁగుచునున్న పవిత్రినయ్యో! యే
పాపి తెగించెనో కొ పరభార్యనుముచ్చిలనంచు నెంచితిన్.

కం. అంతటఁ జేరితి రాజస
భాంతర మొకదాని, దాని యధీశయమును నే
వింతగఁగంటిని, నొసఁగ
నెంచియు రారాజు కొలుపు యాసనొప్పన్. 25

మత్తకోకిల

వృద్ధపౌరులు రాజబంధులు వేషధారులు మంత్రులున్
యుద్ధశీలురు వీరపుంగవు లుద్ధతుల్ ఘనకాయులున్
శుద్ధవర్తులు తంత్రబుద్ధులు శక్తియోగులు భోగులున్
దద్ధరాపతి కొల్వునందు ముదంబుగూర్తురు సర్వదా. 26

చ. తుటిచినటనిల్వఁగాంచితిని ధూర్తుఁడుదిట్టతనాన నొక్కఁడ
చ్చటకొకతన్వివేణిఁగొనిసభ్యులుచూడఁగనీడ్చి తెచ్చి,యు
క్కట! భువనేశుఁ డెచ్చటికిఁగన్గొనఁజీరలనూడ్వఁబోవుటం
తట నలనారికృష్ణయని ధ్యానమొనర్చుటభక్తితోడుతన్.

చ. అదికని యేమి యాగడమయా! కడనూరకఁజూతురే మహా
విదులరుమీరలంచు నటవెంట నె లేచితి నామెఁగావఁగన్
మది వడి హెచ్చరించ నయినన్ దెలివొందితి నంతలో నె, నే
నదియొనరింపకుండఁగనయా రె! కలంచు నెఱుంగజాలితిన్

ఉ. చూచితి లేచి స్వప్నమునఁజూచినకాంతలుపుణ్యలౌట వేఁ
డోఁచెను భారతాదులను దొడ్డమెలంతలటంచుమెచ్చుటా
సౌ! చిరకష్టముల్ వడసియంతయు నోపికతో సహించువా
రే చిరసౌఖ్యముల్ కుదిరి యెంతయుఁగీర్తివహింతురిమ్మహిన్

# 6 సృష్టిసూక్తము

కం సారంగధరుని మెట్టనుఁ
జేరెడు దారికినిజనక చేరికఁగల పా
తేరునకున్ దిగుబాటను
గోరక యలనడుమ నూడ్చుకొండ్రి మసలుచున్. 1

చ. తొలకరివాననీటఁదులదూగెడుకొండకొలంకుతూమునన్
గళగళ శబ్దగుంఫనమనర్గళమై వినిపింప వీను విం
దలవడఁ జెంగటన్నిలిచి యల్లమనోహరసృష్టిబోధ ని
శ్చల వివశాత్మనైచు, గనుఁజూపుల నొక్కక్షణమ్ము
గాంచితిన్. 2

కం. క్రొంజలముల కెంజిగితో
రంజిల్లుచుఁ బిల్లగాలి లాలనములకున్
బింజించెడు నలలెచ్చఁగ
సంజను బోడసూపెఁ గొలను స్తవనీయంబై. 3

మ. దరిపై మొల్కలఁ దేఱుపచ్చిక వినోదంబయ్యె నందంములన్
శిరముల్ చూపెడుతుమ్మచెట్లమునుకల్ శృంగారమైతోచెనా
మఱుఁగున్ గూండ్లనుడాగి ఱెక్కవిదలన్ మైవిచ్చుపక్షుల్
[కనన్
గఱవమ్యెన్ మితిమీఱుమీనముల సోగల్ సొంపువెం
[పొఱెడున్.

తే. అట్టివేళను వినవచ్చె హాస్యవచనము
లొలుకఁబిలుపు పోఁడు "ఓ నారి! రాణి! రావె!"
"రావె! చిన్నారి! రాణి! యాలాగటంచు"
వెంటనే నాపడుచూపు లా వెంటఁదిరుగ. 5

ఉ. ఆపిలుపాలకించుటనె యాత్మగతంబునఁ జెంతమెట్టపై
నో పెడపల్లెనోష్ప్రుతికిమంగళిత్సవమెచ్చఁగఁదప్పిదేశసం
స్థాపితగాథగానమును జల్లని గాలికిఁబుచ్చి యెవ్వరో
యాపగిదిన్ బయల్ వలికినారని యెంచితిఁగాని ముందఱన్

ఉ. కంటిని మబ్బులోఁ బసులకాపరి నొక్కని తానమాడి వాఁ
డొంటిగ దేహమాత్మకొను మండి యుదృష్టినిగిడ్చి బెల్లుగన్
మంటినిదీసి లోవసరి మట్టము మట్టిమిళించుఁ బోదమే
యింటికటంచెలుంగునిడు నింపుగ దేనినొ నర్మవాక్యమున్

కం. నేనది కనుగొనుచునె యీ
మానిసి కీపాంశమును మక్కువఁదగులన్
మానవతి యెవ్వరితె యని?
యానీటను మంటిసుతుల యంతనెచూడన్. 8

కం. నీడను నికనంతా నొక
తాడిని డాగుండి తలనుదప్పించుక తా
నేడనుగనఁబడ కిఁతా
లాడెను నొకమహిషధాము నరసినవాఁడన్. 9

ం. పై నెండ కాయు నీటను
దా నావవల్లనుండి తనివిని గనమిన్
మానిసి పరసప్రుఁబిలుపా
ప్రాణికి వినఁబడదు చిత్రరత్నాంగనినన్ 10

ం. మఱియొక మా ఱకఁ డించుక
యరమర లేకల్లనల్ల నందఁపుమంతన్
దిరుగవె రత్నాంగి యనుఁ
దిరుగవె చిత్రాంగి యనుచుఁ దిరుగఁబాడున్. 11

శా. ఆపాటన్ రమణీయదీర్ఘముగ రాగానన్ దుదన్ బెంచి సి
గ్గేపాటున్ గనఁబోక పాడెఁగద రా యెంతైన మోహానఁదా
నాపట్టున్ మఱువంగనోపునది పోత్రైయుంట; నవ్వించదో
దాపున్ గగ్గవినోదినై వినుమ మాత్మన్ వింతసంతోషికాన్!

కం. లోకంబున మూర్ఖులరై
మూకలుగానుండు జనుల ముచ్చటఁగొలుపన్
సాకెదు రమ్య రహస్యా
శ్లోకస్థలమదియ సృష్టిసూక్ష్మంబౌ రా! 13

---

# 7 చిన్న నిదుర పెద్ద నిదుర



ఆ. వె. నిదుర రాత్రిపూట నేఁ బోవునప్పుడు
ఘడియ యెంతయగుట గణన సేయఁ
గాలమెల్ల నొక్కలీలగఁ గడచెడు,
వత్సరంబు లనక వయసు లనక
వెలుతు ఱేదియుంచుఁదలపోయ నిసుమంత;
కనులుమూయునంత గాఢతమసి
వెలుఁగు చీకటి యను విభజనమే లేక
యొక్క కల సుదృష్టి నొప్పుచుండు.
మనుజజంతురాశి మఱచియే పోవుచుఁ
గునుకుఁగనినయంతఁ గూర్చుసఖ్య
మాతఁ డీతఁ డనెడు నంతర మెఱుఁగని
శబ్దరూపరహిత శాంతి యొకఁడు
చిన్న యిట్టినిదురె నన్నింతఁదనియించఁ
బెద్దనిదుర యెంత పేర్మికలదో!

# 8 నాయమె?

—:)o(:—

ఉ. నల్లనియుక్కు కాయమున నమ్మికఁగట్టిన దండ పిక్కటో
మ్మెల్లయుఁ బిక్కటిల్లఁ దల నెంతొ భరమ్మును మోసి కొంచున
ల్లల్లన రాజమార్గపునడన్ నడ తెంచెడు కూలివాఁడొకం
డుల్లము తల్లడంపడఁగ నోపికఁబర్విడికొంచు నాసతో 1

తే. గీ. నాదుబండికమ్మి సేదతీఱఁగనాని
యెదియొ చెప్పఁబోయి బెదరువడుచు
వెనుకనడచుచుండె విసువని నడకమై
వచ్చువాని చిన్నె లచ్చుపడఁగ 2

సీ. క్రింద బాటనురేఁగు కెంధూళిపటలంబు
సీలమండకు నెగజిమ్మి యంట
ఎగఁగట్టి మొలచుట్టు బిగియించి త్రిప్పిన
గట్టిపుట్టము రొంటి పట్టువదల
ఆయాసమునకోర్చి యడుఁగిడునొడలంట
దట్టంపుఁజెమ్మటబొట్టు బలియ
తలను బుజమ్మును తడవు తడవు మార్చి
బరువు రెండింటికిఁ బంచిపెట్ట

గీ. క్షుత్తుచేఁ బొట్ట వెన్నంట నుత్తకాళ్ళ
నీడ్చి చుసురంచు నింకె దూరమెంతో యనుచుఁ
దలఁగ దేనాటి కనుచును మఱల మఱల
నన్నుఁజూచుచు నొక వెడనవ్వు నవ్వ 3

ఉ. ఆతనిఁజూచిచూచి యిఁకనాగక ప్రశ్నముభావవైఖరిన్
"మోతను జాలమోసికొని మోయఁగనేరనిపాటుతోఁ పనీ
రీతిగ నెందునుండి యెటకేగుచునుంటి"వటంటి నన్నులో
నాతురపాటుమీఱనతడాఁడఁగసాగెనునేనునూఁకొనన్.4

మ. చలిగంజిన్ వడిఁద్రాగి వేఁగునను నే సంసిద్ధునై యుల్లలో
పలిమన్నెంబులనుండి వత్తును కసన్ బందుల్ కలారల్ల ద
వ్వులగోదావరికవ్వలన్ సడలితిన్ బ్రొద్దెల్లమధ్యాహ్నమే
కలియున్ గంజియుఁద్రావలేమనకికన్ వేళదేమెంతకున్

శా. తండ్రీ! పట్టణమింక నెంతదవ్వు?సంతోషించుమూపున్న నె
వ్వాంఛైనన్ బెదరింతురే మొయమనన్ భాగ్యానకేమున్నదా
గుండ్రాతిన్ బలె బాండ్రభూమిమఱుఁగున్ ఘోరాటవిన్
గ్రోల్పులుల్
గాండ్రింపున్ జరియించుమన్నెములపక్కన్ నక్కుమా

తే. అని యనెడులోన మాబండి యుల్లతేఁక [బొంట్లకున్.6
పాకలనుదాటి వాని కీనలఁజెలఁగు
నేడుమఱ్ఱుల సత్రంబునీడ దరికి
వచ్చినద చూడు మల్లదే పట్నమనఁగ

చ. అదికనుసంత నెంతొవినయమ్మున "నామన వాక్కు"
[టంచుస
మ్మదపురహాస్యపుంబ్రకృతిమన్ననసేయుచు "వెఱ్ఱిబాగులన్
సదయతఁజూడు" డంచును భుజంబున మోపునువిప్పియం
[దులన్
బాదివినకొత్త పన్నిడని మొండినిఁ జొకటిముక్కఁదీసియే
విధముననైనఁ దీసికొనివెళ్లు నుపాయముఁజెప్పుమంచనెన్

కం. ఏటికి? కొంపోమంటిని
చీటికి భయమంచువాఁడు చెప్పెఁ దలఁకుచున్
మాటాడక పొమ్మంటిని
వీటికి దాఁ గొత్తయనుచు వేడెఁను మిగులన్ 9

ఉ. బండిని గడ్డికింద నిడి పైనల గుమ్మముదాటునంతనే
యుండనితండ్రితండ్రి! యనియెంతయునన్ బ్రతిమాలుకోఁ
[గనా
తుండునుదాచిపెట్టి వడిఁ దోలుచు బండిని బోవనిచ్చితిన్
మెండుగసంతసంపడుచు మేనుజెమర్చుచువాఁడు వెంటరాన్

కం. ఆటంకము లేకుండఁగఁ
జీటికి పొమ్మియకుండఁ జేరితిమి పురిన్
మాటికి దండం బిడుచును
దాటించినయల్లముక్కఁదగవాఁడు కొనెన్.

చ. కొనుచునతండుఁ "దండ్రి! యటుకూలిని దెచ్చుకయిట్లు [కూడునన్
మనియెడు మేము నట్టడవిమ్రాఁకులఁగొట్టుక వాడుకొన్న నె
వ్వనివొ యటన్నతీరుగను బన్నులవేయుచు బీదసాద నె
మ్మనమున జంతుఁగొల్పుటలు మంచియె న్యాయమె" యం
చు నన్విడెన్.

---

## 9 కళాశాల

---

చ. ఇట నిరుడిట్టిసంజలనెయిప్పథి నెచ్చెలితోడఁగూడి ము
చ్చట విహరించి యింటికవిసంబసకొమ్ముఁజనంగఁజాలునేఁ
గట! యిది యేటికియ్యెడనకారణ చింతన సేయుచుంటి ను
త్కటముగఁ జూడఁజూడ నెదఁదట్టెడు చింతవిచారభార [ముల్.

సీ. సొగలొ శ్యామపున్నాగముల్ తెలిపూలు
చల్లవో? యిదియేమి చల్లకేమి!
ఇంపుతో ఘుమ్మను చంపకమ్ముల తావి
గుప్పవో? యిదియేమి గుప్పకేమి!
దిటములై పెఱిఁగిన వటవృక్షములు చాయఁ
జూపవో? యిదియేమి చూపకేమి!
పూతనై ప్రవహించుగాలము తెమ్మెర
వీవవో? యిదియేమి వీవకేమి!

కిచకిచ మటంచు చూరులపిచుక లిప్పు
డెగురవో యిందు? యిదియేమి యెగురకేమి!
బెదరి బెదరి గోడల మేఁకపిల్ల లిపుడు
రాయవో యిందు? నిదియేమి రాయకేమి! 2

ఉ. ఆడరొ? మోళ్లఁబచ్చికబయళ్లనుగొందఱుబంతులాటలన్
బాడరొ? వెన్నెనిర్ఝరిణిపజ్జనుగొందఱు పాతపద్యముల్
కూడరొ? లోపలన్ సభలఁగొందఱు వాసరచిత్రచర్చలన్
జూడఁగనద్దియెల్లతొలిచొప్పునెపోఁజఱుగంగనయ్యెడున్.

కం. కారా మునుపటియొజ్జలు?
లేరా సంఖ్యను మునుపటిరేలన్ ఛాత్రుల్?
ఈరా మునుపటివిద్యల?
నారయ నదియెల్ల నడచు నప్పటి యట్లే. 4

తే. అయిన నెమ్మనమందున నభినవముగ
నుదయమొందెడు నొకచింత నుండనైతి
నేనుకొన్నాళ్లు లింకింపు నేర్వనైతి
నంచునైన యుండనోపునో? యదియుఁగాదు. 5

చ. పొదలు కళావిధానముల పొందగు నీవర పాఠశాలలోఁ
జదివినవారుకారె మఱి చాలపరీక్షఁ గృతార్థులౌచు స
మ్మదపడువారుకారెయిటు మున్గలకాలమునుండిపాఠకుల్
మదిఁదలపోసిరే యిటులమామక మానసమట్లు వింతగన్

కం. ఏమో వారలు నావలెఁ
బ్రేమంబునఁ జింత చేసి వింతగఁ దోపన్
వేమారు తలఁచుకొనుచున్
గామితకారణముఁ దెలియఁగాఁజాలరొకో.

సీ. అరయ నియ్యది మన యర్థపుస్తకమందె
కనిపించు నీగురున్ వినఁగనేల?
ఊహింప నిది మన కుత్తవాత్రియె కాదె
వృధగను నీగురున్ వినఁగనేల?
భావింపఁ దుదకలపత్రిక్ష్ణంబులే తెల్పు
మునుముందు నీగురున్ వినఁగనేల?
తలపోయ నిదియెల్ల తెలుఁగుసంస్కృతముగా
విదితంబె యీగురున్ వినఁగనేల?

గీ. అనుచు నెంచుకొనుచు గురుల్ వినుచు దానిఁ
బెడచెవినిబెట్టి కొన్నాళ్ళు కడపితిమిగ
చదివి చదువని చాడ్పున సంతసమున
నొజ్జలును మమ్ము దయఁ జూచు చుండుకతన.

హాయపత్రిచారరగడ:—

మత్తియూడ మంటినాడ
గొత్తెపిల్ల కొసరిచూడ
భూరుహాములు పూలువిడువ

పాఱునదిని బడవ నడువ
కూలిపిల్ల కూడు తేఁగ
బాలుఁడొకఁడు బండి లాఁగ
నరసికొనుచు నందుఁబాడఁ
గఱచి గంటఁ గడపు వాఁడ. 9

సీ. అగ్గింపకుందురె న్యాయశాస్త్ర మెఱింగి
తలఁపులన్ నిచ్చలు తగిలియున్న
కొనియాడకుందురె గురువిధానము నేర్చి
కుఱ్ఱవాండ్రకుఁ జెప్పఁ గూరుచున్న
నుతియింపకుందురె జత పరీక్షలుఁ దేఱి
యుద్యోగ పధికార మొప్పియున్న
వినుతింపకుందురె ఘనశిరుల్ గణియించి
గుణియించుచుండెడు గొప్పనున్న

గీ. సన్నుతింపరె పట్నవాసంబు నున్న
బొగడకుందురె పల్లెలఁ బొదలుచున్నఁ
గ్రిందటేడిందు విద్యలఁ గెరలి నట్టి
ఛాత్రసత్తము లీ కళాశాల నెంచి. 10

చ. పొడమెడు యౌవనంపు నెఱిపోఁడిమివావిరిపుట్టురత్నమిం
పడర కళాప్రయుక్తముగ నచ్చపువిద్యల సానఁదేఱి మె
య్యెడ గురువిచ్చు నెత్తుడుపు లీనెడు కాంతిఁ జెలంగినట్టియా
కడచినవాళ్ళఁగోర్కె మెయిఁగ్రమ్మఱ రమ్మన వచ్చునట్టివే?

# 10 వారినిపాతము

మ. తుదినీదర్శనభాగ్య మబ్బెనుగదే! తోరంపుసంతోషమీ
మది రెట్టింపఁగఁ బాపనాశన మహాంభఃపాతమా!నీవు నీ
కదె! చెంతన్ విలసిల్లుచున్ బ్రచురమౌ యాకాశగంగాం [బువుల్
రోదగా మబ్బులుముస్గువెట్టుకొన,నాలోచింపఁజోద్యంబవే.

ఉత్పలమాలిక

వారినిపాతమా! యిటులపర్వత రమ్య రహస్య సీమలన్
స్వైరవిహారివై రదనపంక్తియనంగ గుహాస్యమందు,మం
జీర మనంగఁ బాదపవిశేషపదంబుల, వ్రేలుముత్తియాల్
పేరన శైలకంఠములఁ, బృథ్విమెఱుంగన రాలుటాకు న
వ్వారిగఁ గానిపించి తొలిపల్కు తెఱంగున మ్రోయుచుం [దువే,
కోరికనాట్యమాడుదె,యకుంఠితమాతలఁ బ్రోలుపోలెఁజె
ల్వారుదె, చాటుచాటు వెలివత్తువె; చూడవినంగ నౌర!ప
త్తీరులు నీదు పోకడలు, తెన్నిదియంచు నెఱుంగలేము,నీ
హోరున నర్థమేమికలదో గ్రహియింపఁగలేము, కానలో
ఘోరమృగాళిఁ దావకసుగోష్ఠి సతంబును బోధసేయు, నీ
నీరముతన్ప నీదు రమణీయవిలాసము కంటికింపుగాన్

దూరము నివ్వనాంతరపుదుర్గమహాకనుమన్ సృజించెనో!
భేరి నినాదమట్లు వినిపించెడు నీధ్వనిచేతఁ బిల్లలై
చేరి, వియచ్చరాంగనల శృంగనునీనడచేత బ్రాయపుం
బూరుషులౌచు మోహపడి, పూర్ణమతుల్ ముదుసళ్ళ
[తెల్ నెఱుల్
తీరున ఫేనమిూను నినుఁ దెల్వికినిల్వవటంచుజ్ఞానులై
యారసి, సన్నుతింతురికద యాతురతన్ భవదీయయాత్రి
[కుల్

---

# 11 విం త వి లో క న ము

—:)o(:—

చ. పదిపయి నాలుగేండ్ల యెలబ్రాయపుఁ బెంపువహించుమై
[పసల్
కుదిరిచి కచ్చుకుచ్చెదగఁ గూరిచికట్టిన జిల్గుచీరసొం
పొదవఁగఁ గన్యకామణిమహోదధిసాంధ్యతరంగఫేనసం
పదలకెలంకునొక్కరితస్వైరవిహారిణియాచుఁజూక్కెడున్.
చ. అరయఁగఁ గానరారుకద యాప్తులు బంధులు కానియా
[మోముం
దఱ వెనుకెందుఁ జూచినఁ దదాత్మను నెంతయుఁగోరి యే
[మనో

హారునకొ యిట్టులట్టుల నడాడుచునున్న దటన్న జూపులం
దరమర యించుకేనిఁ గననైతిఁ గరంబు విమర్శసేసినన్.2

సీ. ఏదఁబయ్యెదనుహత్తి నుదుట ముంగురులొత్తి
చలువ పయ్యెరల నాసక్తిఁబీల్చు
విరియురింగు లదల్చి యొరయునందెమఱల్చి
పైఁబడు సీటవిభ్రమితనాను
మొలనూలు సడలించి జడ పూలు కుదియించి
గుల్లరంగుల మేలుకోర్కె నేరుఁ
గెమ్మోవి నవ్వుఁదాల్చి కేల్గన్నుఁ గవఁదేల్చి
యలయపారాబ్ధి ప్రియానఁజూచు

గీ. నంతియేకాని యితర మొక్కింత కనదు
పలుకరించదు కడు పారవశ్యయగుచుఁ
దనదుహృదయాబ్జమం దెట్టి తలపులూని
మెలఁగుచున్నదొ తెలుపను తొలఁగిచనదు.

తే. ఎవరి లతకూన యగునంచుఁ దివిరి యెవ్వ
రైనఁ బలికింప యత్నింతురేని నౌర!
నిష్ఫలంబయ్యెడిని నల నిమిషమందె,
ముగుదసిగ్గు తొట్రిలఁగ మూర్ఛొమువెట్టు. 4

ఉ. తుమ్మెదయంటు లేనినవతోయజరాజముబోల్కి దోషహీ
నమ్మయి యుల్కునాపె వదనమ్మునఁ బెట్టనిసొమ్ము కాఁగఁ [ బే
మమ్ము తలిర్చుచుం బరుల మానసమున్ హరియించి [ నూత్న భా
వమ్ములనిల్పి యారా! కనుపట్టెడు నొక్కనికొక్క వైఖరిన్

ఉ. ఎవ్వరి చిన్నదాన వగుదేటికి నొంటిగ నిట్లు వచ్చితో?
యెవ్వి త్వదీయ భావనములిట్టులనాకొకరవ్వ దెల్పుమీ
మవ్వపుజవ్వనీ! యనుచు మామక మిత్రవరేణ్యుఁ డొక్కఁడా
నివ్వెరపాటుఁ దీర్చుకొనసనీతి మెయిన్ గదియంగఁ బోయినన్

ఉ. ఆతని సాహసంబుఁ జెసి యుల్లస నేసిటు వల్కెనాఁడు; నో
భ్రాతృవరేణ్య! యట్టిసురామ మనోహర ముగ్ధచేష్టసం
భూతకలారహస్యముల బొందెద తున్ వెలియాటలేల యా
కూఁతుకయారు పేర్వడిచికార్చెడు దృష్టి సుఖాబ్ధిఁ దేలుమా

కం. అని యాతని సమ్మతింగొని
గొనబగు నొక యుసుకతిన్నెఁ గూర్చుని తమిమా
కనుఁజూపు సాగునంతకుఁ
గనుఁగొంటిమి అల్లవింత కన్నియ నిచ్చన్. 8

చ. కనికని యామె చెయ్యులను గౌతుకమంపుచు నెట్టకేలకున్
గనఁబడదింత దవ్వరిగఁ గన్నియ యెవ్వరి నాసటంచు నె

మ్మనమున నద్దియెల్లమటుమాయగఁదాలిచియప్పుడప్డుజ్ఞ
ప్తినిఁగొనిమేముతద్విధమువింతవిలోకనమంచు నెంతుమే

---

## 12 శాద్వలసుమము

---

చ. జలజలజాలువాఱు నొకసన్నని తీయని పంటకాల్వకా
వలిదరి నిర్జనంబయిన పచ్చని మెత్తనిశాద్వలాంకురం
బులపఱుపున్ మనోహరపుఁ బొద్దును బుచ్చుచునున్న
[ నాదు క
న్నులకునుదర్శనీయసుమనోజ్ఞసుమంబొకటట్లెఁదోఁచుచున్

చంపకమాల.

తనదగు చిన్నిమోము నొకతట్టునకున్ మఱలించి గడ్డిలో
గొనబగురంగుడాచుకొని కొంకుచునుండినదానినిట్లు "ఓ
మనసగుపువ్వుమిన్న! యనుమానమదేల? త్వదీయజీవనం
బునకునుసాటియెద్ది? పెనుపున్ గనుదానవు పచ్చికంములన్,
దనిసెదువాఁగుతుంపఱు, విదాహముతీర్చుకొనంగనేర్తువే
నునుఁదుహినంబులన్ ఋతువునున్ బడువానల, నైక్యమా
[ దువే

జినుఁగునుడు పశ్చిమాకాశమునఁ జెల్వారు వెన్నెల తెల్పులంను, లే
తనవులఁగుల్కు దేయరుణతన్ బ్రభవించెను బాలభానుఁ జూ
డ్కినిరమణీయసంచలనక్రీడలఁ జొక్కె దెమందమారుతం
బున, బెదరంగనేల? మొగమున్ బెడపెట్టఁగనేల? సమ్మదం
బును విడనేల? యీవ" నినఁబుష్పేటు మాఱువచించె

[ "నన్న! యీ
ఘనమగుభోగముల్ పడయఁగన్ దగుటల్ మునునీదుపాదఘ
ట్టనమునుదప్పఁజాలినకదా యనియాసలు బాసితిన్ గడుణ్."

---

# 13 రావిరవళిక

—:0:—

ఉ. పల్లియమూలవీథి నలువంకల నింకొకయిల్లులేదు మా
పల్లనభోజనాలసమయంబయి సందడితప్పె నోషధీ
వల్లభుబందువన్నె కనుబంధువొనర్చెడుఁ బంటచేనులన్
సల్లలితానిలంబు వెదజల్లెమఁ జల్లదనమ్ము మాఁకులన్.

తే. ముంగిలినెసంగు తిన్నెపై మోదమొలయఁ
జుట్టుఁ జోద్యంబు కందోయిఁ జూఱఁగొనుచు
నొండు నవయువానుండు కూర్చుండియుండె
సృష్టి నగ్గింపనెంచు కవీశుమించి.

తే. డోలికలఁ బండుకొనుఁ బసిబాలలట్లు
కెంపులొలికించు చిగురాకు జొంపములను
గూర్కనొందెడుఁ బోలు శకుంతతతులు
కానిచోఁ జెవినిబడదె కలరవమ్ము. 8

తే. గోపబాలుండు పొలమున గోగణముల
విప్పి పాలకావడినూని వేణు వూదు
కొనుచుఁ దనయున్కిఁ జేరెడు వినఁగనయ్యె
హృదయరంజకమైన శ్రీకృష్ణగీతి. 9

తే. ఇంతదనుకఁ దల్లిపొదుఁగు సంతసమున
గడుపు నిండారఁ గుడిచి మాఱఁగన్ను వెట్టు 10
వెల్లలేఁగపైఁ బ్రసరించు వెన్నెలజిగి
సితతరంబయి నిశ్చలస్థితిని నెగడు.

తే. అదియె చలియించు పచ్చిరావాకుపైని
చాయతళుకుఁగుచు మిగుల చంచలతఁ బెరయు
అబ్రపడనేల? సహజంబె యద్దియెందు
నాశ్రయంబుల గతులెపో యాశ్రితులకు. 12

తే. అలరుఁ గొమ్మల రవళిక నాలకింప
సాఁకబడెనేమొ నిశ్శబ్ద మీకడలను
శాంతమాధుర్యరవము నిరంతరంబు
వినఁగవచ్చెడు నుండిలే దనఁగ నహహా! 13

ఉ. ఇట్టిమనోజ్ఞసీమ లభియించిన నిర్మలమానసంబునన్
గట్టితపస్వియైనను పరకాంక్షలఁదెర్లించితపం బొనర్పఁడే?
అట్టిననేల యొండునవమానవశీలుఁడు ముద్దుగుమ్మఁ జే
పట్టి మనోజులీల కయివారము సేయుచు హాళిఁదేలఁడే?

క. అని పలుతెఱఁగుల సృష్టిని
గణియించుచు నడుమనడుమ ఘనముగ నెదియో
వినుకలిబడ వినుచును నది
తనుఁగాదని యెంచుకొనుచుఁ దరుణుండుండన్. 15

క. అమ్మాయీ! మగనికి నీ
ల్లిమ్మా! లేవంగవచ్చు నెపుడును నాల
స్యమ్మేయగు ననియెడు వా
క్యమ్మును నొడువంగనయె గృహాంతరమందున్. 16

చ అదివిని యేయనన్ బెరటియందల రా రెడు "వర్ల" బావియం
దుదయమునొందెనీరములనొప్పఁగఁ జేదెడునిస్వనంబులన్
బొదలెడుకంకణప్రకటపూర్ణ ఝణంఝణ, మంతకంతక
య్యదితమినాలకించుచును నాదెసనాతని దృష్టిపాఱగన్

ఉ. లోపలనుండి చంచలవిలోచనయొత్తుక నిండునీళ్ల చెం
బోపిక నొక్కకేల ధవళోచితమౌముడుఁగొక్కకేల నెం
తో పసుపుప్పతిల్లఁగొని దోపినకుచ్చెనుజార్చి గుమ్మమం
దాపసువంపుమూర్తి కన నల్లనడంతువనుంచి లేచుచున్.

ఆ. ఎన్నికలనుగన్న యించువింటి బిగించి
వదలు మోహకుసుమ బాణపటనఁగ
బొలుపు వలపుఁ దెలుపు బొమగవఁ ద్రిప్పుచు
నొఱపుఁజూపు చుఱుకు నెరపుచుండి. 18

కం. తడిసిన హస్తతలాబ్జముఁ
దుడుచుచు నద్దానికతనఁ దొలఁగిన పయఁటన్
వడి సవరించుకొనుచు న
య్యెడ ద్వారంబుపయి నొరగనెంచుచు నుండన్. 19

మ. వనజాక్షీ! యెదిరైననుండునట నాద్వారంబుపై నానఁబో
కనుచున్ గాంతుఁడు కాంతపాణితలమత్యంతంబుఁ జేఁబట్టి పై
రనుఁగున్ గుప్పుచుఁ జేరఁదీయుచును గాఢాలింగనోద్యుక్తుఁడై
తనవామాంకమునందునిల్పుకొని యాతన్వంగితో నిట్లనున్

మ. చెలియా! చేతులిలాఁగకున్నె జలముల్ చేదంగ వ్రేళ్లెఱ్ఱగా
నలిఁగెన్ బోఁగలశంబు తెచ్చునెడ మేనన్ జెమ్మటల్ వోసె నే
యలివేణీ! మొగమట్లు పెట్టకుము సిగ్గందంగ రాదింక నో
ళ్లలయన్ దంపతులొండొరుల్ తెలుపుకోనాయాసముల్
[ తీఱెడున్.

తే. తనదు పదునాలవకళను దప్పికడవఁ
గ్రిందు మీఁదను బడుచుండె నిందుఁ డంచుఁ
బద్మముఖి! నీ క్షణక్షణ వర్ధమాన
మైన యాననశ్రీఁ జూపనగును గృపను. 22

కం. కంటే శారద కౌముది!
వింటే నిశ్శబ్దమహిమ! వెలఁదీ! నిక్కం
బింటికి ముంగడ నిట్టివి
యుంటొక భాగ్యంబుసూవె యుత్సవమొదవన్. 23

ఆ. వె. కుందరదన! నీదు మందహాసరుచులు
వనజగంధి నీదు తనువు వలపు
శీతవెన్నెల నలవాతపోతములను 24
వెలితి నెల్లఁదీర్చ వెలయుచుండె.

తే. తెల్లనగుఁ బూలగుత్తులఁ దెలుప లిట్లు
తమ వినీలంపుసికలను దాల్చుచుంటఁ
జూచి మబ్బులు చందురు దాచుచుండు
అల్లదే! చూడు నామాట కల్లయేమొ! 25

తే. అందమున్ జక్కఁజేసికో నద్దమెరి
యాస్యమునుఁ జూప వానితో హాస్యమాడ
సరసి యాత్మతలమ్ము చంచల మొనర్చ
భావహీనమ్ములని వానిఁ బలుక నగునె! 26

తే. కొక్కె మొకింత గట్టిగ నొక్కుకొనుము
గీసికొనుకంటె మెడవంచ కీరవాణి!
పలుకు బంగారమాయెనా వాతెఱలను
మెదపవేటికి? యిచ్చోట మేరకాదొ? 27

తే. రమణి! తెలియుమా వెన్నెలరాత్రులందు
చెలులు చెలువులు కూర్చుండి వలపులూర
ముచ్చటలఁ దేలుదురె యేని ముందుజన్మ
మందు వారు చకోరద్వయంబు లనుచు. 28

చ. పలుకుచునట్టె యాతఁడెలబ్రాయపు బాహువునం బ్రి [యాంగనా
లలితవిభూషశోభితగళంబునఁ గౌఁగిలిపూర్తి సేయ జె
క్కులకునుదార్చినొక్కికొనగోరులతోనిమురంగఁబోయినన్
నెలఁతుకదాని నెల్లరమణీయముగాగ్రహియించినవ్వుచున్.

కం. నాథా! చెల్లునె మనకిటు
వీథిని సయ్యాటలాడఁ బెఱవా రరయన్
శోధింతురు సఖు లెఱిఁగిన
బాధించెద రెకసకియపుఁ బల్కుల నెంతో. 30

తే. అనుచు ననియెడుసతినుడి నాలకించి
హస్తతల మల్లనల్లన నందుకొనుచుఁ
జెక్కుఁజెక్కుఁ దార్కొనఁజేసి మక్కు వెసఁగ
నమలసృష్టి హాస ప్రేరితాత్ముఁ డగుచు. 31

కం. బాలా! భార్యా భర్తలు
హేళిం దేలంగఁగోర నన్యుల వేళా
కోళము లాటంకములా
యీలీల విచిత్రసృష్టి యెన్నఁడుఁ బోడమున్. 32

తే. కలికి! కావలసినపుడు కలుగఁబోవు
మంచిసమయంబు లవి యసామాన్యములును
కావున యదృచ్ఛ నయ్యవి కానఁబడిన
ననుభవింపఁగ నొప్పగుమనుజునకును. 33

తే. ఉవిద! అన్యోన్య మెడఁబాసి యుండునట్టి
దంపతులు ప్రాయశంబుగఁ దలఁచుచుందు
కూడుకొనుటకు రేయెండ వేఁడి వేచఁ
గూడినమనము వీడంగఁ బాడియగునె? 34

ఉ. అంతియకాక యిప్పుడిట కన్యలు వచ్చెడువేళకాదు శు
ద్ధాంతరహాస్యలీలఁ దలఁదన్నఁగఁజాలెడు చాతుర్యమీఱునే
కాంతమెసంగు నిందనుచుఁ గాంతుఁడు సంతసమెచ్చఁ
[దృ ప్తినొం
గాంతసుధాధరంపునవకంబును ముద్దిడుకొన్న మెల్లనన్.

కం. మదవతి నాథునితో ననె
నెదుటనలరు రావిరవళి కెసఁగుచు నుంటఁ
ఛదనంపుగూటి నిదురన్
గుదురుపడెడు పక్షి మేలుకొనుటన్ గనుచున్. 36

ఉ. ఎవ్వరు కాంచఁబోరనుచు నిప్పుడుమీఱలువల్కినట్టి వా
క్కవ్వలబెట్టి కట్టెమట నాథరణీసుహా సంభ్రమ శుత్రం

బవ్వివాహగంబులన్ నిమురనల్లడిపెట్టుచు జూపునీదిశన్
మవ్వపుముద్దుఁజెట్టి నను మన్నన మీారిటుసేయు చెంచు

తే. దాన తరుణుండు వల్కెడుఁ దరుణినెంచి [చున్.
"నీవు కనుగొన్న దంతయు నిశ్చయంబె
కాని దానికి నొండొక కారణంబు
కలదు నీకును నయ్యది తెలియు సకియ!"

తే. "పలికితిని నేను సందర్భవశత నట్లు
కారణంబేమొ చెప్పరె మీరు తొల్లి
మీకుఁ దెలిసినదంతయు నాకుఁ దెల్ప
బాసచేసిరి చెప్పమి పాడికాదు." 39

ఉత్సాహము:—

అనుచు నెట్టివింత కారణాంతరంబు తెలుపునో
వినఁగ మనము సంభ్రమింప వెలఁది ప్రియునికంఠమున్
దనదు మృదులబాహులతలఁ దగఁబెనంగవేయుచున్
వినయభావ మెనయుమోము వెడఁదమెడఁదఁ జేర్చినన్.

చ. నెలఁతరో!సాధ్యమే మదికి నీకడ దాపఁగనంచునామెనా
చెలువుడుఁ ప్రక్కకున్ దిగిచి చెల్వలయన్ మణికట్లుహ [త్తుచున్
మెలికలు వ్రేళ్ళనల్లుచునుమించెడునెయ్యపుశ్రద్ధనొగ్గు పీ
నులకును విందుగాఁ గతమునున్ నుడువంగఁ దొడంగె [నివ్విధిన్.

సీ. వడకొట్టు ననుకొంచు జడియంగ నేటికి
కలుగుఁబోఁ బొడుగునఁ గాల్వనీళ్లు
ఎండదెబ్బనుకొంచు నెద నొంద నేటికి
పొదలుబో నిరుగడన్ భూరుహాళి
వేఁడిగాడ్పనుకొంచు వెనుకాడ నేటికి
జరగుబో నెడనెడఁ జల్లకడలు
ఆకలియనుకొంచు నాగంగ నేటికి
అమరుబో నూఁరూర నన్నసత్రి
తే. మనుచు నెట్టెట్టొ సరిపుచ్చుకొనుచు వైళ
మత్యవసరము లైనకార్యములు పిలువఁ
దప్పదని బాటసారులు తఱలుచుండు
మట్టమధ్యాహ్నమున నొండుచెట్టు క్రింద. 42

ఆ. బండి నాపుచుండి బండివాఁ డంతన్న
వారితోడ నిట్లు పలుకసాగె
నింతనుండు నేను ముందుఁ గానఁబడెను
దారి తిన్నగానె యూరుఁ జేర్చు. 43

ఆ. మీ రడిగినయిల్లు దాటినే పోవంగ
రావిచెట్టునొండు ప్రక్కఁ గాంత్రు
దాని కెదుట కలదు త్వరితంబుగను రండు
ప్రొద్దుక్రుంకు తిరిగి పోవుటకును. 44

ఉ. ఆపలుకుల్ వినంబడినయంత నెపూరుషుఁడొక్కఁడుండు బం
డాపుమటంచుగ్రిందదిగియుంపన నింకనుగూరుచుండి యే
మో పలుతీసులన్ వివిధయోజనలన్ నిదురించు బాలకున్
లేపుచువచ్చినార మదె లెమ్మిఁక నెల్లినిదీయుమాయనన్

తే. షోడశాబ్దలతా సుమశోభగరిమ
యొడలిఁ దన తాపులను నలుఁగడలఁ బరప
బాలకుండును డిగియెను బండినంత
నుభయులును దోసివఁగొనిరి మృదూక్తులెసఁగ. 46

చ. పురవన శోధచేసితిమి ముఖ్యకులాబ్ధులనెంచినార మెం
దరసిన గాని, యొక్కవిధి నక్కలలేదనినాఁడ విందిఁకన్
సరిపడఁబోవునే మనకు సత్ఫలమున్ బడయంగఁజాలుదే?
పరుసఁదనంబుఁ బోవిడిచి భావనసేయుము తృప్తి నెంత [యున్

తే. అనెనుఁ బూరుషువచనంబు నాలకించి
మాఱుమాటాడ కల్ల కుమారవరుఁడు
చుట్టుపట్టుల జనపదచోద్యములను
దేరకొనఁజూచుచును నడతెంచుచుండి. 48

తే. మొదటియడుఁగు నెపోసెడు ముచ్చెమటలు
నొడలిఁ గ్రమ్మెడు దుస్తులు తడుపుచుండఁ
జేరుమాలున నొత్తుకోఁ జెంతనున్న
పొలముగట్టున మామిడి చలువనిలిచి. 49

తే. మెఱకమడినివేసిన గడ్డిమేటినీడ
కల్లనల్లన దుముకుచు నరిగియందు
జాఱు గింజలనేరుకో జంట కుదురఁ
గూఁటము మురిపెంపు ముద్దులగువ్వఁ జూపు. 50

తే. అంత కంతకు వేఁడిమి నధిక మగుచు
నందుకొను గాడుపునను నాయాస మెచ్చఁ
గాపువట్టిన కొబ్బరి తోఁపు కెలన
నాగి యిసుమంత విశ్రమం బందవేచి. 51

తే. కంచెలోపల విరిసి పుష్పించుచున్న
బండిగురివెంద తీవెను వలపుమీఱ
లేవనెత్తుచుఁ దక్కిన లేఁతలతల
గణనసేయని తాళవృక్షంబుఁ జూపు. 52

తే. కనఁబడెడు నీరములు దప్పిఁ దనుపుకొంద
మవయవంబులఁ గడుగుద మనుకొనంగ
ఱాతి పావంచరేవు నాసీత మగుచుఁ
దారసిల్లిన చిన్నకోనేరు దిగుచు. 53

తే॥ ఉదకములఁదేలి రాజిల్లుఁ గొదవపువులు
మిగుల నింపుగ సొంపుగ నెగడుచున్న
విడిచి పుచ్చుచు బద్మముల్ విడుపుఁ బొందఁ
గొఱలు ప్రాతప్రభాకర కరముఁ జూపు. 54

ఆ. వాని బూరుషుండు వరుసఁ గనుంగొని
తనదువాక్యములకుఁ దగనొసంగు
నుత్తరంబులట్లు చిత్తంబు నెఱుఁగుచు
మేలుఁగోరి గొడుగు మెల్లనొక్కి—

చ. ముడుచుచు రావియియ్యదియె ముంగల నిల్లదెయంచు [వేఱుగా
నడుగక మెట్లనెక్కుచునునాతలుపుల్ దెఱవంగఁదట్టినన్
వడిగృహమేధి దగ్గఱగుబందుగు లెవ్వరొవచ్చిరంచుఁదా
గెడ నెడలించిచూచె స్మృతికిన్ స్ఫురియింపదు వారిఁ [జూచుటల్.

తే. అయిన మర్యాదకనుక పాద్యంబు లిచ్చి
లోపలికిఁగొంచు బల్లనుజూపి యుంచు
నెలమి దయసేయు డంచు శీతలజలమ్ముఁ
గ్రోలగానిడి దప్పికఁ గొంతఁదీర్చి! 57

తే. ఎండఁబడి వచ్చినారలె యిల్లువిడిచి
యెపుడు బయలుదేఱిన వారొ యిప్వరిపుడు
సరగ మడిఁగట్టుకొని లెండు జలుపఁ దగును
ముందు భోజనంబేమి మోమోట పడక. 58

తే. అనుచు వడివడి పట్టుపీతాంబరములు
తెచ్చి యిచ్చిన వానినిఁ బుచ్చుకొనుచుఁ

బూరుషుండును సందర్భ పూర్వకముగఁ
బలుక సాగెను నించుక బయలు పడఁగ. 59

తే. ఆర్యసత్తమ! యేమాత్రి మన్యసరణి
నెంచబోకుడు మీరలు వృద్ధులగుట
మమ్ములను జూచియుండరు మాజనకుల
జననులను దెల్ప నెల్లవిస్పష్టపడెను. 60

తే. అంతెకాక వచ్చిన కార్యమంత యిందు
సానుకూలంబు కాఁగలదేని ముందు
మీరు పిలువకే వచ్చెదువార మెన్ని
సారులైనను మీయూరు దూరమనక. 61

తే. అచ్చెరువు హెచ్చె డాన గృహస్థు మదిని
నిట్టులట్టుల వెనుముందు జుట్టిపట్టి
తలచి యెవ్వరో వారి బాంధవ్యమెదియొ
స్మృతికిరామి మగుడ శ్రద్ధఁ జెవులనొగ్గె. 62

ఉ. అంతటఁ బూరుషుండు తన యన్వయమున్ దమ తల్లి
[దండ్రులన్
సంతస మొప్పఁజెప్పనది సర్వముఁ బూర్తిగనాలకింప క
త్యంతముదంబునన్ బలికె "ఆ! యిక నెల్లనుగోచరంబె
[మీ
రింతకు వచ్చుటెంతయును నీక్షణభాగ్యమటంచు నేర్తె
[ఱను. 63

తే. పలికి వాస్తవ్యుఁడింటి లోపలికినరిగె
నంతవఱకును నాళల నరయుచున్న
బాలకుఁడు నవ్వి పురుషుని బలుకరింపఁ
బోవుచుండిననంత సముద్ర మెలర్ప. 64

సీ. కమ్మకచ్చూర తైలమ్ము నొత్తిన నల్ల
ముంగురుల్ మోమున మురిసియాడ
అగులుబొట్టును బట్టియద్దిన నునుఁగెంపు
కుంకుమ నుదుటను గులుకుఁ గొలుప
తడిగుడ్డతుడుపులఁ గడుదిద్దిన బెళుకుఁ
గాటుక కన్నులసీటు నెరప
ఒడ్డాణమునుఁజేర్చి యొప్పించు వలెవాటుఁ
జయుఁట నెమ్మేనున వలపు నిలుపఁ

తే. గన్నెయొార్తు పడచు టింటి గడప దాటి
కొంకునందియల్ మోృయంగ గూటికరికి
నేగి పొత్తముల్ కొంచును సోగచూడ్కి
వారిపైఁజూచిచూడని తీరుఁబఱపె. 65

తే. పిల్లచూపునఁ జిన్నవాఁడుల్లమందు
సంతసిల్లి పురుషునకు సంజ్ఞచేసె
పూరుషుండును నద్దాని తీరెఱింగి
బాలికనుగూర్చి ముద్దగు పలుకు లొసర. 66

కం. అమ్మాయీ! బడి కేగుదొ
"రమ్మా! యిటులొక్కమాఱు రమ్మా!" యని యెన్
గొమ్మయు రమ్మని యనఁగన్
నెమ్మిక డాపునకువచ్చి నిలువంబడుచున్. 67

చ. పొడమెడుసిగ్గుచేత నెఱిమోమును వంచుచు బల్లపైనిగో
ళ్ళిడి యొకవింతగీయుచును నింపుతలిర్చెను బూరుషుం [డునుం
"బిడియము చెందకమ్మ యిదె వేగమె బాబయ వచ్చు [వారు మా
కడలను గూరుచుండు" మని కన్నియనుం బయికెక్కఁజే [యుచున్.

ఆ. చిక్కువడిన యట్టి చిన్నికాసులపేరు
సరిగఁ దీసికొనుచు నరుణచరణ
యుగము దాగమడచి యొప్పుగఁ గూర్చుండఁ
బేరుచెప్పుమన్నఁ బేరుచెప్పె. 69

ఆ. తీవ్రమైనయెండ దిగజాఱి నీడయు
జగిలెపైని వ్యాప్తమగుట నరయు
బడికిఁ బోవువేళ యపుడె కావచ్చెనా
యీవు చదువు తరగ[illegible]తెద్ది యన్న. 70

ఆ. బడికిఁ బంపరచటఁ బాఠంబులందున
నేర్వనుండదంచు నేర్పుచుండ్రి

నాన్నగారె తీటి యున్నప్పుడెల్ల మా
యరుఁగుమీఁద వీని నంచుఁ దెలిపె. 71

ఆ. ముందునుంచుకొన్న పొత్తంపుఁబుటలను
దీసి యొక్కటొకటిఁ ద్రిప్పుచుండ
నేమిపుస్తకంబు ఏది పాఠ మొకటి
చదువు నీవెతీసి చదువుమన్న. 72

తే. బాలరామాయణంబని వడివడిగను
వనిత! నాతోడ నేటికి వనములకని
రాఘవుండన వానితో రక్తిసీత
పలుకు ప్రత్యుత్తరసువాక్యఫణితిఁ జదివె. 73

ఆ. చెంతనున్న పలకఁ జేతితో నట్టిట్లు
చెఱపి గీతపెట్టి చెఱుపుచుండ
లెక్కసేయఁగలవ యొక్కటిచ్చెద నిదె
చేయుమన్న శ్రద్ధఁ జేయగలిగె 74

ఆ. తలఁపునకును నేదొ తట్టంగ నద్దాని
నూహ సేసికొనుచు నూరకున్న
పద్యపుస్తకముల పఠియించితివ యేని
యొప్పగించుమమ్మ యొక్కటన్న. 75

తే. ఏ శతకమందు పద్యమో యెంచుకొనుచుఁ
గొంతసేపు యోజించుచుఁ గోకిలంపుఁ

గంతమును నెత్తి పఠియించెఁ గడకునొక్క
కందమును గుమారీశతకంబు నుండి.

ఆ. ఉండియుండి యెదుటనున్న బాలకుపైనిఁ
జూడ్కి నిల్పి మిగులఁ జోద్యముగను
క్రొత్తరాగ మొండుఁ గూర్చుకొనుచునుండఁ
బాట నొక్కదానిఁ బాడుమన్న. 77

ఆ. చెలువ చాలతడవు సిబ్బితిఁ బడుచును
బాడెఁ బూలచెండ్లపాట నొండు
వినెడువారి కెంతొ వీనులవిందుగా
స్వాదురసము లొలుక వరుసఁ బెట్టి. 78

ఆ. ఏమి సేయుచున్న నిదియేమి పేరలు
ఎదియొ యొండుదాన నిచ్చుచుండి
రనుచు నిట్టునట్టు లరయుచు నుండంగ
"అమ్మ! యొక్కమాఱు రమ్మటంచు." 79

ఆ. పిలువనయ్యె దానఁ జెలువనుఁ బురుషుండు
వెళ్ళవచ్చునమ్మ తల్లి పిలుచు
నన్న బల్లదిగుచుఁ గన్నియ లోపలి
కేగి నిల్చి యమ్మ! యేటికనియె. 80

తే. తల్లి వెండిగిన్నె పిల్లచేతికి నిచ్చి
పిన్ని యింకఁ దోడుపెట్ట దేమొ

దీనఁ బాలు తోడి తెమ్ము నీ కయ్యేడు
నత్తవారు వారటంచుఁ బలికె. 81

చ. అదికనిపెట్టి వారికవు డాగఁగఁ దీతికలేమిఁగొ్రత్తఁగా
బొదలెడుఁజన్వుఁ జూపుచును బూరుషుఁడాయిలుసొచ్చి
["యయ్య! ఏ
మిదిశ్రిమనొందబోకుఁడిట నిప్పుడునిల్వగఁగాదుమూకువె
ళ్లెద" మనిపల్క, "వచ్చితిరొ లేదొయిటుల్చనుదేర భా
[వ్యమే"

తే. అనుచుఁ బీటల వేయంగఁ బనిచి వారి
నందు విచ్చేయుఁడంచును నరుగదెంచి
నట్టి కార్యంబుసర్వంబు నందు జరపి
నట్టిదాని నెఱుఁగుచు గృహాధిపతియు. 83

కం. వా రిఁక నుండమటంచున్
సారెవచించినకతమున మఱి మీాకరుగన్
గోరిక యుండిన నే మన
నేరుతు నేఁ బొ్రద్దుపోవు నిలిపిన ననుమున్. 84

ఆ. తిరిగి పురుషునాపి సరిగ మా యిల్లైనఁ
జూడలేదటంచుఁ జుట్టుఁ బెరడు
గదుల నెల్లజూపి మదిలోని కోర్కెల
సరవిఁదెల్పె నెంతొ సరసముగను. 85

ఆ. బాలకుండు మాత్రి మాలోపున నె తాను
వీథియరుఁగు నాని వింత నిలిచె
నక్కపోయెనింట నుండంగలేమి నో
యాత్మఁబొడము తలఁపు లాపలేకొ. 86

తే. అతని హృదయసరోవరమందు నల్ల
కన్యకాదృష్టిపతనము గాటమైన
భావ వలయంబులను గూర్చి ప్రతిరుతమన
వాక్యముల నివ్వధిని బయల్ వడఁగఁజేసె. 87

తే. "భ్రమరమా! యింక నీ పరిభ్రమణ ముడిఁగి
యీ నవోత్ఫుల్లపద్మంబు పైని వ్రాలి
యలవడెడు స్వాదుమధువుల నానుకొనుచు
సంతతంబునుగనుము నితాంత శాంతి. 88

తే. తిరిగితివిగ కాననముల నరసితివిగ
కొలఁకులను జూచితివిగ తోటలను మిగుల
చంచలంబని చూపఱు లెంచుకొనఁగ
నెఱఁగవో యిందు నీసుమ మెసఁగుచుంట. 89

ఉ. నీమనమందు నెట్టుకొను నిష్ఠురచింతల నెల్లఁబాపి స
త్ప్రేమముఁబెంచి నిన్ను పరితృప్తమగానొనరింపఁగల్గుచున్
గామిత మోదమిచ్చెడు వికాసయుతమ్మగు మానసాబ్జమే
యేమియుసందియంపడక యీవువరింపఁగఁజెల్లునిచ్చమై.

ఉ. ఈవసుధాస్థలిన్ గలుగ దెయ్యెడ నచ్చినదంచునన్నయా
తావకరూఢివాక్యమును దబ్బఱసేయ నదృష్టధిష్టమై
చేవడుచున్న యీాయనుఁగుఁ జెల్వపుఁబూవునుజెట్టపట్టి స
ద్భావనసువాసనల్ కలిపితద్దయునిశ్చలసౌఖ్యమందుమా!

తే. తొలుత నీ నుండి తమినిటు దొంగిలించు
కొనిన మోహానైక్షణములు దినదినమ్ము
వృద్ధి కాంచకయున్నె విశుద్ధముగను
స్వాతిచినుకులు శుక్తినిఁ బ్రిబలుసరణి. 92

తే. దైవమును నెంచి యుండు నద్దాని నీకుఁ
గాక పోయిన నీవిటు రాక యుందు
కోకిలము సేసనే లేఁతకొమ్మ నెఱిఁగి
మలయవాయువు కూర్పంగఁ దలఁపకున్న. 93

కం. నీ మది కెయ్యది యింపో
యా మూడ్కినె సేయఁదలతు రార్యులు నీకిం
దేమాత్రి మెదురు వలుకరు
ప్రేవకిం బిట నిశ్చయింప వెనుదీయకుమా." 94

కం. అని పలువిధముల నాక
న్నెను దమిఁ బరిణయ మగునని నెమ్మదికిన్ బో
ధన సల్పుచు నిల్చిన బా
లుని కన్నులకగపడె నల లోలాక్షి మఱిన్. 95

ఆ. జనని పనిచినట్టి పనుపునఁ బాలను
బూని వచ్చుచుండెఁ బొందుకుదురఁ
దనకు నత్తవారె యనిన వాక్యంబులు
మదిని నొక్కి వింత మమతఁ గొలుప. 96

కం. ఆ రమణి నడక తీరును
నారసి యబ్బాలకుండు నాశ్చర్యముగన్
గోరిక లుప్పతిలంగను
నీరీతిన్ దలఁపసాగె నింకయుఁ దనలో. 97

తే. "కన్నె సౌందర్యసంపద గరిమ కంటె
స్వాదుకలకంఠ కంఠభాషణముకంటెఁ
జూడ సొబగైన కనుఁగవ చూడ్కి కంటెఁ
గడు మనోజ్ఞత లొలికించు నడలకంటె. 98

తే. ఘనతరంబుగ నెద్దియో కడలు కొనుచు
మామకాత్మను హరియించు మఱలమఱలఁ
జూచుకొలఁదిని నొకవింత తోఁచుచుండి
క్రొత్త నెమ్మని మది నిగురెత్తసేయు. 99

తే. అతిదృఢం బగుశాఖల నంటియున్న
నట్టులిట్టుల దడదడ నాకులాడు;
అతి విశాలాంబరంబున నలరుచున్న
జలజహితమండలముఁ గుమారిలుచు నుండు. 100

ఆ. జనని పనిచినట్టి పనుపునఁ బాలను
బూని వచ్చుచుండెఁ బొందుకుదురఁ
దనకు నత్తవారె యనిన వాక్యంబులు
మదిని నొక్క వింత మమతఁ గొలుప. 96

కం. ఆ రమణి నడక తీరును
నారసి యబ్బాలకుండు నాశ్చర్యముగన్
గోరిక లుప్పతిలంగను
నీరీతిన్ దలఁపసాగె నింకయుఁ దనలో. 97

తే. "కన్నె సౌందర్యసంపద గరిమ కంటె
స్వాదుకలకంఠ కంఠభాషణముకంటెఁ
జూడ సొబగైన కనుఁగవ చూడ్కి కంటెఁ
గడు మనోజ్ఞత లాలికించు నడలకంటె. 98

తే. ఘనతరంబుగ నెద్దియో కడలు కొనుచు
మామకాత్మను హరియించు మఱలమఱలఁ
జూచుకొలఁదిని నొకవింత తోఁచుచుండి
క్రొత్త నెమ్మిని మది నిగురెత్తసేయు. 99

తే. అతిదృఢం బగుశాఖల నంటియున్న
నట్టులిట్టుల దడదడ నాకులాడు;
అతి విశాలాంబరంబున నలరుచున్న
జలజహితమండలముఁకుమారిలుచు నుండు. 100



తే. కాని కోమలి మృదులంపు కరతలముల
నలరు ధవళంపు క్షీరంబు లనుభవించు
నతులసౌస్థత హృదయమా! యరయ చాకొ?
వదలకుము తత్సుఖస్థితి వదలఁబోకు." 101

తే. అనుచుఁ దలపోయునంతలో నాగృహస్థు
నుండి సెలవును గొని పూరుషుండు "తప్ప
కింటి కేగినవెంటనే యెల్ల మేమె
యుత్తరమువల్ల దెలుపుదు ముందుఁ డింక. 102

చ. వెనుకకుఁబిల్వఁబోకుఁడీక వెళ్లుచునుంటిమి మీకునల్లుఁడై
యనయము పండుగుల్ పిలువ నర్మిలి వచ్చెడువాఁడితం
[డు" "జా
గొనరిచినార మింపుఁగడు నూతునె యింకను బండి య
[చ్చోటన్"
"గనుగొను మింక నొక్కపరి కన్నియనున్ మనమోలిల
[వచ్చెదున్."

తే. అనుచు వీథి గుమ్మముదాటి కొనుచు నందు
నిలిచియున్న బాలుని భుజములను జేయి
వైచి చిరునవ్వు నవ్విన బాలకుండు
మోహపుం లజ్జపడుచు మార్గమును వెట్టె. 104

తే. బాలికయు వారిఁ జూచిన వడినె యొక్క
వింతపుయిలోటుఁ బొందుచుఁ జెంతనున్న

కోమలపుఁజాయ సౌభాగ్య! రామమైన
రావిచెట్టుమాటున డాగి త్రోవ యిచ్చె. 105

తే. సిగ్గులొగ్గిన వారల చేష్ట లెంచి
రావికొమ్మంతఁ బూనెను బ్రతిన నిట్లు
ఇప్పుడింతఁగ లజ్జించు నీయిరువురు
నొండొరుల్ ముద్దు లిడుకొను చుండఁ జూతు." 106

తే. అనుచుఁ జెప్పిన కతమెల్ల నాకలించి
పువ్వుఁబోఁణియు తెలి చిఱునవ్వు లొలుక
"తత్ప్రతిజ్ఞనె యీ రావి తలఁచియున్నఁ
బూర్తి నెఱవేఱకే సిద్ధి బొంగుచుండె." 107

తే. అనుచు నాథునియరుణ హస్తాబ్జతలము
లేవనెత్తుచు ముద్దాడి "లెండు మీర
లన్నయును నదె మడిగట్టుకొన్నవాఁ" డ
టంచుఁ బలికెను గొంతుఁడు నట్లొనర్చె. 108

తే. వారుభయు లంత తలుపును జేరవైచి
కొనుచు వెడలినారలు నాటఁగోలె నందు
వచ్చుకవులకుఁ దానట్లు పట్టినట్టి
ప్రతిన నెఱవేఱు టనయు మా రావి వినుచు. 109

# 14 కృష్ణ!

—:0:—

ఉ. ఇక్కడ కేను దొల్లినొక యేడునఁ జూడఁగవచ్చినప్డు మా
యక్కయు బావయున్ గలసియాలను లేఁగల మేపుకొంచు నీ
యిక్కలఁ బొద్దుబుచ్చెడను, నేమిదికన్పడకుండె నేమియున్
అక్కట! తాఱుమాఱయినదంతయు నెందుననున్న వారొకో

సీ. తెలివేకువలయందుఁ గలరవంబులఁ గొల్చు
పెద్దవృక్షము వ్రేళ్ళఁ బెల్లగిల్లె
రెండుజాముల వేళ నిండునీడ నొసంగు
పూలపందిరి నేలఁ గూలఁబడియెఁ
సాయంతనములందుఁ జల్లగాలిని వీచు
ఘనశిలాతలములు తునుక లయ్యె
రాత్రిభాగమునందు రక్షణంబొనఁగూర్చు
చిన్నకుటీరంబు శిథిల మొందె. 2

గీ. యేపునొప్పెడుపచ్చిక లెండువట్టె
దొడ్డికల్లెల్లపుచ్చునఁ దొఱగిపోయె
కోఁడెదూఁడలరాట్లన్ని యూడిపడియె
చిన్నతాళ్ళుగట్లుసర్వము చీకునొందె. 3

తే॥గీ. కదుపులెల్లను అయ్యయో! చెదరిపోయె
పడమటావులు కటకటా! బక్కచిక్కె

ఆల బోతులిస్సిరో? కుమ్మెలాడుకొ నెవు
నెట్టిపాపము పుట్టెనో చుట్టుపట్ల. 4

కం. వినఁబడదు వేణునాదము
వినఁబడవుగ మందకుక్క బిగ్గఱ మొఱుగుల్
వినఁబడవుగొల్లసుద్దులు
వినఁబడ దొకయీలయయిన వింతఁగుఁ జూడన్. 5

శా. హా!కృష్ణా! యెటు పోయితీవయయొ! అన్యాయంబుగా
[దోఁచెడున్
నాకున్ జెప్పఁగలేకపోయితి వె?అన్నా!మృత్యువున్ బొందితే
లేకుంటే కనకుందునే జగతి నీలీలల్ వినన్ నేరనే
యేకారిన్యపదార్థముల్ చెఱికెనీయిుంపైనప్రాణంబులన్.

కం. వడగండ్ల వాన నైనను
వడకని నీమేను పెద్దపామున కైనన్
జడియని నీ మానసమును
పడిపోయె నె ఘోరమృత్యువాతను కృష్ణా! 7

కం. నీ వేణునాదముల నిఁక
నేవేళను వినఁగనేర నీవికగీతా
భావంబుల నాకెంమును
కావలెనని యున్నఁగాని గలుపవు కాదే. 8

ఉ. ఈ సెలయేటి నడ్డుపడి యీఁదఁగనేరరు గోపబాలకుల్
వేసెద నొక్క తాఁటినని వెక్కవచించితి వేసినాఁడవే?
యీసమమైన చెక్కనొక యింటిని గట్టెదనంటికట్టితే?
హా!సఖ!యేమిచేయఁగలవంతమునిన్నటుముంచివేయుచో

ఉ. కోరిక లెన్ని యేని మదిఁగూర్పఁగవచ్చునుగానియవ్విచే
కూరెడు భాగ్య మబ్బఁగ నకుంఠితజీవిత ముండవద్దొకో?
ధారుణినిల్పి యీజన పదంబుల కెంతయుమేలుసేయుస
ద్భారము చాలబూనుదని తద్దయు నేఁ దలపోసియుంటి

తే. ఇంక నెప్పుడో నేమంద లేలునపుడు [ముఁనే.
నీదు చెంగటనే యుండి మోదమునను
నిర్వ్యరము తోఁడు నీడగ నెసఁగు వార
మనుచు నాసించి యుంటిని యనవరతము. 11

సీ. లలితంపు సెలయేటి జలజలం బాలించి
యూహించు చుందు మే మొక్కనాఁడు
కోమరు మీాటెడు కొండ కోనల విహారించి
యుప్పొంగు చుందుమే మొక్కనాఁడు
తులకించు చుక్కల తళుకుల బొడఁగాంచి
లెక్కించు చుందు మే మొక్కనాఁడు
నచ్చిన విర్విరైన పచ్చికలను వేఁపు
పూదించు చుందు మే మొక్కనాఁడు. 12

గీ. ననుచు మురిసెడు వాడనో యనుఁగు మున్ను
నిట్టు లగునని యెన్నండు నెంచలేదు
కట్టు! ధైర్యంబు నాకింక నెట్టులుండు
కార్యముల బూని సఫలతఁ గాంచ నన్న. 13

ఆ. వె. ఎంతొ ప్రేమతోడ నీ ప్రదేశంబుల
మలయు చుండువాఁడ వలదినముల
నిప్పు డొక్కమాఱు నే ఋతువున నైన
బుద్ధి వీనిఁ జూడఁ బుట్టకున్నె. 14

తే.గీ. మొక్కమావితోటను గాచు ముసలితాత
జోకమగు పండ్ల మేలేర్చి తోక బుట్ట
వేసి బడ్డిని వ్రేలాడఁదీసె నదిగొ!
మనల కొఱకని వానిని దినఁగ రావొ. 15

తే.గీ. దమ్ముచేసిన యట్టి కేదారములను
నాటు నూడ్చెడు వారలు హర్ష మెచ్చఁ
గంఠములఁ గల్పి యెక్కడి గానములను
వింతఁ బాడెద రంమను వినఁగ రావొ. 16

తే.గీ. ఉదయమెల్లను గుప్పను నూర్చి యంత
తెచ్చినట్టి చలిదిముంత తృప్తితోడఁ
గుడుచు పాలికాపుల యబల నడవడికలు
చోద్యము లటంచు నెంచుచుఁ జూడ రావొ. 17

తే.గీ. గ్రామ మధ్యంబునను నొప్పు రావి నీడ
లందు తీఱుబడిని గూడి హాళి కాళి
ముచ్చటాడుకొనుచునుందు రెచ్చటికను
ననుచు వారితో భాషింప నటకు రావా. 18

ఉ. ఎక్కడి రాక లింక నెపుడేనియుమృత్యువువాతఁబడ్డవాఁ
డొక్కఁడు వెండికానఁబడుచుంమటవింటిమె? లేదు వెఱ్ఱినై
మక్కువ మీఱ నట్లు పలుమాఱులుపల్కుదురావరావ [టం
చక్కట! యేటి మాట లిక నాప్తవరేణ్య! మమున్ ద్య [జించితే. 19

తే.గీ. ఈ స్థలంబును నీమాల నీజనముల
విడిచి యుండగఁ నేర నియ్యెడల నున్న
నిన్ను స్మరియింప కుండని నిమిషమున్నె
యెట్లు విడనాడు వాఁడనీ మెసఁగు చింత. 20

తే.గీ. చనిన వారల గుణములు మనమునందు
బొడము నేనియు వానిని బోలునట్టి
వస్తువుల జూచుచుండిన వగపుతగ్గు
నంచు నెంతయు నేనిప్పుడెంచు చుంటి. 21

తే. వేణునాదంబులను నల వెదురు పొదల,
బలుకులను నల్ల సెలయేటి జలజలముల

నుంచి యేగితి వని వాని నెంచుకొనుచు
నిందె దిరుగాడు చుండు నానందముగను. 22

## 15 రాజ్యపదచ్యుతుఁడు

—:x:—

తే. బారుమను నొక్క పెద్ద యావరణమందు
శిథిలమై పోయి చెల్లెల్ల వృథగఁ బెరుఁగు
కోటగోడల నడుమను గొనకు మిగిలి
యున్న చావడిలోపలఁ దన్ను మఱచి. 23

తే. చిన్న పట్టెమంచంబుపైఁ జిరుగుఁబ్రిక్కఁ
బండుకొనునొంటి నలపూనపాటి కొమరుఁ
డాత్మయందలి యూహాదేహంబు మించి
జేష్టలను సల్పు స్వప్నసుగోష్ఠిఁ దగిలి. 24

ఉ. ఆతని కంటిముందు కనసొను నొగిన్దనపూర్వులెల్లరున్
జేత స్వతంత్రిముంచుకొని శ్రీయుతులై యొకపెద్దరాజ్య
[మున్
గీతిమెయిన్ భరించుటలు నిల్వనుమీాఱిన కోటగోడపై
నాతతసైన్యముల్ నిలిచి యన్యులకున్ జొఱగామి సేయు
[టల్ 3

మ. మఱియున్ గాంచెనువాఁడు గా సకలసంపద్ద్వారవార్ష్యం [బయా
పురమున్, దీర్చినయట్టిబాకొలువునన్,బాల్యాంమనంతః [పురీ
పరివారంబును రాణివాసమున శేవన్‌బుచ్చుకాంతామణీ
సరసంబున్, మృగయా వినోద పదసంచారాటవీ ప్రాంత [మున్. 4

తే. కాని నిక్కమముగ, దనకాలవైప
రీత్యమును జేసి తలయింత యెత్తఁబోఁడు
పలుకరింపఁగ నొక్క సేవకుఁడు రాఁడు
బ్రిదుకు నుపకార వేతన మొదిగికొనుచు. 5

సీ. అతని ముందునఁ గేళికాల యోపవనంబు
మోడువారుటఁ గాంచ మోదమెట్లు?
అతని ముందున వేటలాడు తావులు రైతు
సొంత భూములుకాఁగ సుఖమదెట్లు?
అతని ముందున సర్వస్వాతంత్ర్యములు కొని
నామ మాత్రుని సేయ నవ్వుటెట్లు?
అతని ముందున తన యఖిల భాగ్యంబులు
నరి కొల్లకొని పోవజరగు టెట్లు?

గీ॥ శోచనీయుండు సుమ్మి యారాచబిడ్డ
మూల కొండికట్టు నొక్క యాముదపుసెమ్మె
దీపమును బెట్టుకొనుచు నిదిరించువాఁడు
పైని బూజుసరంబి ప్రాఁబనులు తనుక. 8

తే. ముంగిలిని బుంజులను గట్టు మొద్దుటాళ్లు
పుంజు లేమియు లేకయె పొడముచుండు:
ఒక్కటియొ రెండొ గొరువంక లక్కజముగ
పంజరంబునఁ బలుకు సెప్పకయె పెరుఁగు. 9

తే. అయిన నొక్క సుదినము కద్దతనికంచు,
దెలుపఁగా నెంతయును నేను గులుకువాఁడ:
దాపునను ప్రసిద్ధమగు క్షేత్రంబు కలదు
దాన నేఁటేటఁ దీర్థ ప్రథమ దినంబు
రథము బయలుదేఱెడు ముందు రాజు తనదు
చేయి ముందుగ వేయుచుఁ దియఁడేనిఁ
గదల దించుకయైనఁ జక్రంబటంచు
నధిక గౌరవమున వానినందు నిలిపి
ప్రజలు మిక్కిలి కొనియాడువార లింక. 10

# 16 వర్షానంతరము

తే. పెద్దవర్షంబు కురిసిన వెనుక నొక్క
సంధ్య వేళను స్వైరసంచారి నగుచుఁ
గాలివ్రేళ్ళఁ గ్రుచ్చుచుఁ జేలగట్ల పైని
నడచుచుంటిని ఘనయోజనము లెసంగ. 1

తే. ఆకు మళ్లెల్ల నిర్మలమైన వానఁ
దడిసి యొకవింత చెలువంబుఁ దాల్చియుండె.
అందునందుఁ జిందెడు నీటి బిందువులను
జివరనాపంచి కుచ్చెలు చెమ్మగిలెను.

తే. ఱెక్కలల్లార్చు కొనుచును నొక్కటొకటి 2
పక్షులెల్లను గూయుచు బయలుపడెను.
అల్లనల్లన గట్ల పగుళ్లనుండి
బిలబిలమటంచు ధారలు వెలికిఁదొఱఁగె. 3

తే. ఆకసంబెల్ల నెప్పటి యట్ల తనదు
సహజనీలంపుఛాయల జరపుచుండె
నపరదిశయందుఁ జెలగె సాంధ్యాభ్రమాల
ప్రళయమందైన నారని ప్రభ యనంగ. 4

తే. అడుగులడుగున నలుగుచు నడఁగియుండు
గడ్డిపూవులకును గల్గె దొడ్డరంగు.

ఏమియును వినఁబడవె యయ్యెడల నొక్క
వాన కురిసి వెలిసిన శబ్దములుతక్క. 5

ఆ. వె. అట్లు కొంతవడికి జరిగిన యంతనే
వినగఁవచ్చెఁ బిలుపు వెనుకనిట్లు
"పెద్దబాబుగారె ! వేంచేసినారు గా
వారిపొలములన్ని వరుసఁగనఁగ." 6

చ. అదివిని యట్టెమళ్ల మొలనందఁగ నేపును జూపు [చేనులో
ముదుసలి యొక్కరుండు తనమూపున గడ్డిని మోసికొం [చు నా
కెదురుగవచ్చిదించుకొని "యిస్సని,గట్టునఁగూరుచుండె; నే
మదిఁగడుజాలినొంది యలమానిసితోనిటుపల్కసాగితిన్

తే. "ఓయి ! రామన్న ! యిదియేమియోయి! పడుచు
నుంటి వింతలో శ్రమలను నుస్సురనుచు"
"బాబు ! కాదమీకిప్పుడు పనుదుఁదనము
నేను మూర్లైడు ముసలి నైనవాడ. 8

తే. వయసు నందున నాగలిఁ బట్టియున్న
బెల్లుబెల్లుల వడినేల పెల్లగిల్లె.
పాఱచేతను బూనుచు నీరుకట్ట
నెవ్వఁడైనను నాకప్పుడీడు కలఁడె?

తే. ఒక్కనాఁ డలకాలువ ప్రక్క మనకుఁ
గాపపరవు వారికిని జగడము పొసఁగ
జబ్బనాపితి నావేళ దెబ్బనొంచు
తప్పిపోయినఁ దలపైనిఁ దగిలియుండు.

ఆ॥ వె. మీరలేమి యెఱుఁగు వారలు నాసత్తు
వల్ల తాతగారి కయ్య కెఱుక
యింతనాటినుండి యిప్పటి వఱకును
కాచి యుంటిమనల "కంప్త" ముండె,

ఆ॥ వె. దాని కేమిగాని తండ్రి! మీరేమేమొ
యెంతొ పెద్దచదువు లెఱిగి తండ్రి
పాడగలరె పెద్ద భారత గాథను
జెప్పగలరె యర్థ మిప్పుడదుఁగ?

కం. మీ కక్కయ్యల పోలిక
నాకథలను వినికి సేయునగునే మీకున్ ?
హా! కంఠంబను చోనల
మీకడ తాతలది, యెంత మెప్పోవడ సెన్,

తే. అయిన మీకివి యన్నియు నవసరములు
కావు కాఁబోలు, రాముఁడు రావణుండు
భీముఁడర్జునుఁడును కృష్ణ నామములును
వారికథ లేమియును మీకుఁ బనికిరావు.

సీ. హరి హరీ నారాయణా యటంచును
పాడి యేతాము త్రొక్కితి నేనుమున్ను
గొల్లసుద్దుల నాడి తెల్ల వెన్నెలయందు
చేనుకా పుంటిని నేను మున్ను
పొలిపొలియని గట్టిపొలి కేక వేయుచు
నిందుఁ బండించితి నేను మున్ను
మన పురాణపు లీలలను గుఱ్ఱలకుఁ జెప్పి
యెంతొ నవ్వించితి నేను మున్ను.
గీ. ఇప్పుడేమున్న దంతయు జప్పఁబడియె
కంత మందలి కంగును గానఁబడదు
ఎన్ని మాఱులో యయ్యలయెదుటగూడఁ
జాటు వాఁడను పెదపెద్ద సామెతలను.
తే. బాబు రండింక చీకటి పడుచునుండె
పురుగు పుట్రుండు నడచెద ముందునేను"
అనుచు నాతఁడు మోపెత్తి కొనుచు సాగ
"నెంత వాఁడవు రామన్న ! యీ" వటంచుఁ
బలుకుచును వెంటఁ బోయితిఁ బ్రిమదమునను.

# 17 సారంగధర

—:(♦):—

ఉత్సాహము

"మిత్రమా ! విహారమునకు మిత్రులఁ గొనిపోవుచోఁ
జిత్రములగుఁగథల నడుమఁ జెప్పి తనుపుచుందురే"
"మిత్రమ! మనసార నట్టిమేలుకోర్కె పుట్టుచోఁ
జిత్రమైన యల్లమెట్టఁ జేరి, చెప్పుకొనఁదగుః. **1**

సీ. పంచాస్యశార్దూల భల్లూకవాసమ
హాటవీవిటపిస మావృతంబు
సన్నుతసత్కీర్తి సంయుతసన్నయ
ప్రగ్గడ కవివర్యభాషితంబు
ధనధాన్యరత్న నిధానసంసూచనా
ప్రాసాదరాజ విభాసితంబు
కోటిలింగక్షేత్ర గోపురశోభిత
పూతగోదావరీ భూషితంబు

తే. ధరనునలరు రాజమహేంద్రపురవరంబు
అందు బ్రాహ్మణపాండిత్య మగ్గలంబు
రాజభుజబల మెవ్వేళఁ బ్రకటితంబు
వైశ్యభాగ్యంబు సత్కార్యభాజనంబు" **2**

చ. "అదె! యలతాళపాదపశిఖాంతరమందునధూమధూళులన్
జదలనునింప నంపుచుఁ బ్రశస్తరుచిన్ దనరారుచుండె న
య్యదెకద తత్పురంబహహా!" "ఔనవు! దానినెయేలు
[చుండె స
మ్ముదమునఁ బూర్వమొక్కఁపుడు భూపతి రాజనరేంద్రు
[రాజనక్. 3

తే. ఆ మహారాజునకును రత్నాంగియందుఁ
బ్రభవమొందెను సుతుఁడు సారంగధరుఁడు;
దినదినమతండు వృద్ధినిఁ దనరఁదొడఁగెఁ
గరముసితపక్ష సారంగధరునికరణి." 4

చ. "అగునగుఁ గోటగుమ్మమనియాసతి మేడనికందకంబటం
చొగిఁబలుకంగవిందుము జనోక్తులనెన్నియొ" నిక్కవం
[బు కా
నగనగువానినిన్బురవనంబునకున్ మునుముందు,నివ్వహా
సొగసగుకట్టడంబులును స్రుక్కివినాశనమొందియుండెడున్

ఆ. మొగ్గ విడిచి యల్లపూవగు పోలిక
నతని శైశవంబు యౌవనమును
బొందె నంత మోదమొందుచు భూపతి
తనయునకును బెండ్లిఁ దలఁచె నెడఁద. 6

చ. తలఁచినయట్లె యప్పుడొకతన్వి పటంబరుదెంచెఁగానియా
చెలిచెలువంబుఁ జూచి తనచిత్తము భ్రాంతి పడంగఁ [బుత్రినిన్"
"దలపక తానెకట్టుకొనెఁ" "దత్తరుణీమణి జవ్వనంబునన్
జెలఁగుచు నుండఁబోలుఁ దమి సేవలఁ జేసెనె వృద్ధభర్త [కున్?"

మ. "వరవంశంబునజన్మమందుటను భావంబందునన్ జంకుచున్
నరనాథున్ దనియించుచుండె, నయినన్ నారీమణీమానసం
బరయన్ జక్కని రాకుమారుపయి మోహంబంది యుం [డెంజుమా
తరి యే నాఁడని చూచుచున్ సతతమత్యంతంబుఁ జింతిం [చుచున్.

కం. ఇప్పగిదిఁ గొంత కాలం
బొప్పుగఁ గడవంగఁ గల్గె నొకరీతిఁ జుట్టున్
ముప్పులు వన్యమృగంబులఁ
దప్పక వేటాడవలసె ధరణీపతియున్.

కం. అప్పుడు వేటకు వెడలెను
నొప్పుల చిత్రాంగి యొసఁగె నుత్తరము పతిన్
దప్పక వడి రండనుచును
జెప్పఁగలేదు సతి పేరు చిత్రాంగి సఖా!

ఉ. ఈ దినమందు రాసుతునినేఁగనసౌనని కుల్కుచున్ మనో
వేదనఁబొందసాగెనలబిత్తరి, యాయపరాహ్ణ మందునన్
మోదముతో నతండొక కపోతమునుంగొని యాటలాడు
[చున్
వే దివిముట్టఁబోవిడిచె విస్మయమెచ్చఁగ జూచువారికిన్.

కం. సొగసుగ నాపారావత
మెగురుచుఁ జిత్రాంగి మేడ నే వ్రాలెను నా
వగలాడి పట్టఁ కొనియెను
సగమహా! చేకూరెననెడు సంభ్రమ మెసఁగన్."

కం. "ఇది యొకనిదర్శనంబగు
మదనుఁడు తన యాశ్రితులకు మఱపక యాయా
యదనుల నొప్పఁగఁ గూర్చెడుఁ
గద! నడుమఁజలికితి ననక కథ నిఁకఁ జెపుమా!"

కం. "పావుర మచ్చోట వ్రాలెను
దేవల దాయనుచుఁ దలచి తిన్నగ నేత
ద్భూనరవరనందనుఁ డల
భూవగసతిమేడ పయికిఁ బోయె రయమునన్."

కం. "ఆవనిత మేడయనుచో
నావంతెన ప్రిక్కఁ గొఱలు నలసౌధమొకా"

"కావచ్చును నేమననా
తావల సాధంబునకును దగు ననవచ్చున్.

కం. ఆసరికేరవియుఁ గుఱ్ఱింకెడు
నాసలు జారులకును హృదయంబులఁ బొడమన్"
"ఆ సంధ్యారాగో దయ
మీా సాయంతన మల్లెయొనరెనేమో కనఁగన్."

చ. "తనకుఁ గుమారుఁ డెట్లగునుదర్థ్యము మారుడటంచు నెం
[చుచున్
వనితయు సాదరంబుగను వానినెదుర్కొని పక్షియన్న ని
త్తును పరులట్లు నీవటులఁ దొందఱఁ జెందెదవేల యంచు
[దాఁ
గనుఁబఱుపంగఁ జొచ్చెఁ దన కాపురమున్ బడకింటి తా
[వులన్.

కం. ఎంతకు సారంగధరుని
స్వాంతము మఱియొక సరణిని నగపడకునికిన్
సాంతంబుగఁ దన పెండ్లియు
దంతంబునుఁ దెల్పె నపుడు తమి యుప్పతిలన్.

చ. తుదకిఁక నెమ్మదిన్ బొడము దుష్టతలంపు నడంపలేక త
త్పదమలవర్తనుండయిన క్ష్మాపతినందనుతోడఁబల్కెనా

హృదయమునీదురూపమున నెంతొవిరాళినిజెందివేగెదున్
సదయతనాదుజన్మమును సార్థకమొందనొనర్పఁగానగున్."

తే. "నావివరుసలు తలపఁగ రావుసూవె!
మంచి చెడుగని యించుక నెంచవుకద!
కాముకులు వారిమనములఁ గాముకుండ
ఖండముగఁ దాండవంబాడుచుండునెడల, 20

వ. "తరుణివచించువాక్యములుతావిని రాజకుమారశ్రేష్ఠుఁడా
కరములరెంటిఁ గర్ణములఁ గప్పుచునిట్టులఁబల్కసాగెదున్
హరహర! నీవిటుల్ నుడువనర్హమె? తల్లివినీవునాకు నే
నరయఁగనీకుఁబుత్రుఁడనున్యాయమె? లోకులువిన్నఁదిట్టరే?,

కం. పలికెడువానిన్ వినకయె
బలిమినియత్నంబొనర్చెఁ బడయఁగ సతియున్.
జలియింపక యతఁడెట్లో
వెలుపలఁబడి గృహమునతను వెడలెను చింతన్" 22

చ. "అది పెఱవారికిన్ దెలుప నాయువనీపతినందనుండు తా
నెదఁ దలపంగలేదుకద యెంతటిధీరుఁడొ శాంతచిత్తుఁడో"
"యదితనుచాటునేనిఁ దనయవ్వనునమ్మనునన్యాయంబు
[నున్
బొదలెడుదుర్యశంబనుచుఁబూజ్యుఁడతండుగ్రహింపకుండునే?

ఉ. అంతటనామృగాక్షి తనయాసలు వ్యర్థములౌట నీసునన్
జింతనసేసి పీనికురుశిక్షవిధింపగఁ నౌనటంచు నే
గంతనొయొక్కమూలఁగడుఁగాసిలినట్టులఁబండె నంతలోఁ
గాంతనుఁజూడరాజు తమకంబునవచ్చెను వేటపాటునన్

కం. వచ్చినఁ దనుఁగనకయె య
మ్మచ్చునఁ జెలియుంటఁజూచి మదినాశ్చర్యం
బెచ్చుగ నుదయింపంగను
జెచ్చెఱదరిఁ జేరి యడిగె క్షితిపతి మహుతన్. 25

సీ. 'మరునికటారివై మరులిగురొత్తించు
వనితరో! నీవిట్లు వనరనేల?
చంద్రికాహాసవై సంతోషమును జిల్క
చానరో! నీవు నన్ గానవేల?
మానినీ తిలకవై మహినొప్పు మానిని!
యవమానవతివగు చడలనేల?
శృంగారవతివయి రంగారు చిత్రాంగి!
శిలుగొంది నీవు చింతిలఁగనేల?'

తే. అనిన యొకియింత బెట్టుగ నల్ల లేచి
'యధిప! నీయానఁ జెపుదు దుర్విధిని వినినఁ
జెప్పఁగా నేమిఫలమని, చెప్పలేక
చెప్పినట్లుగఁ జెప్పె దుశ్శీల యిట్లు. 26

తే. నాకుమారుఁడై నన్నుఁ జీకాకుపఱచెఁ
గట్ట! సారంగధరుఁడు నాచెట్టపట్టె
మత్త యువరాజు నన్నవమాన పఱచె
బలిమి ముద్దులపట్టి నన్బరిభవించె,

చ. అదివిని రాజు డెందమున నచ్చెరు వాత్రిము రోషమున్ [బయిం
బొదువఁగనట్లైకొయ్యయయిపోవుచుమిన్కకసిల్చెనంతట
వ్మ్రదవతియేడ్వసాగె" నవమానమునంభరియించుటెట్టులీ
సుదతులు జిత్తులన్నియును సూక్ష్మముగాఁ గడుఁబన్ను [వారు జూ."

ఉ. "ఓనరనాథ! నాథ!వినుమోనగరేశ్వర!యిట్లుచూడుమా
మానధనాగ్రిగణ్య!యలమాటలునోటనరాకయుండెనా
మానసమెల్ల యిప్పుడవమాన దవాగ్నివిదగ్ధయయ్యెడో
హాహా! నయశాస్త్రవేత్త! తనయుండొనరించెను మా [నహానినన్.

తే. అను చినుమడించి పలికెను నన్యపాప
మించుకెఱుఁగని యావృద్ధనృపతి వణఁక
నృపతియు మఱేమిసేయంగ నేర్చువాఁడు
తల్లిమానంబుఁ జెఱచిన తనయుఁగూర్చి. 30

శా. "ఏమేమీమామృగయార్థమైచనుటవికేనేగంగఁదాఁగాంచిదు
ష్కర్మోన్మత్తఁజేసెనే యిటుల ఛీ! ఖండించెదన్ వా
[నినం"
చేమాత్రింబువిచారమున్ సలుపకేహింసించె నత్పుత్రి
[నిన్
సోమాస్యన్ వతనీతివర్తనుని నస్తోకప్రభాధామునిన్.

కం. ఈతావునందె సుమ్మా
భూతలనాయకసుతుండు పొందెనుశిక్షన్.
చూతమటంటివ యేనీ
ఆతిన్ దత్ఖండనమిటఁబ్రకటితమయెశిన్. 32

కం. కానీ సత్యముడాగునె?
మానిని యొనరించినట్టి మర్మంబెల్లన్
భూనాథునకును దెలిసెను
నానాతియుఁబొందె నంత్యమతిఘోరముగన్. 33

తే. ఉప్పుపాతఱ నడఁగెను నప్పడంతి
యిప్పటికిఁగూడ నయ్యదియెఱుఁగబఱతు
రల్లపాతేరు గ్రామమునందు జనులు
జాయినొకదానిఁజూపి చిత్రాంగి యనుచు" 34

## ఉత్సాహము

"ఇఁకనుమనము గృహమునకును నేగుదమి దెలెమ్ము వే,
సుకరముగను జెప్పితీవు చూచినట్లై యీకథన్"
"సుకరముగనుజెప్పి తీవుచూచినట్లటంచు న
న్నైకసకియము లాడుచుంటివేమొ మిత్రరత్నమా! 35

ఉ. కూలెడుమంటిగోడదిగఁగుర్రింగెడుకప్పనఁదాటియాకులన్
గాలికిఁబుచ్చి ప్రాతగిలికప్పడుచున్న కుటీరమద్ది ది
వ్యాలయమై తమంతగుకుజావళిమామిడి జీడిమామిడిన్
మేలగు చీసమున్నతపుమెట్టను నీకథఁదెచ్చెజ్ఞప్తికిన్" 36



# 18 తీవ



ఉ. ముద్దులచిన్నితీవ! నిను ముచ్చట నెచ్చటొ కాంచి, [తెచ్చి నా
యొద్ద నమర్చి పెంచి కరమొప్పఁగఁ బందిరినల్లి, వేడ్కనే
ప్రొద్దునుబ్రొద్దుదానవనిపూచెడుదానవటంచుఁగుల్కఁగా
నెద్దియొ పెల్లగించినిను నీక్షణమందున రూపుమాపెఁగా

సీ. లేయెండ నీపైనిఁ గాయనోర్చితికాని
ముదురెండ కాయ మార్కొమ్మువెడితె!
చల్లని చినుకుల చవులఁ దేలితికాని
జడివాన కొట్టఁ జంచలతఁగంటె!
పిల్లవాయువులలో నుల్లసిల్లితికాని
విసరి వీచిన నెంతొ బెదరునంటె!
కొనవేళ్ల సవరించఁ బెనఁగుచొప్పితికాని
మోటుతాకిన దిగుల్ పాటువడితె!
నవకములప్రోవ! లేఁదీవ! యువయుకుండ
దినదినాభివృద్ధినిఁగని తుష్టినినాకుఁ
దెలుపకుండఁగ నేఁడఁ బాసితే యొకింత
సొగసు చెలువమ్ము జాడయు మిగులనీక!

ఉ. నీమృదులంపుఁగొ్రింజిపురు, నీరమణీయపుఁజాయ,యల్లనీ
కోమలరాగపుంగలుపు కోలుతనంబొకకొన్నినాళ్లయున్
నామనమందు నాటుకొని నన్నువిడంగను జాలకున్నవో!
శామితవల్లరీమణిరో! కంటికిఁ గట్టినయట్టులుంపు వే. 3

---

# 19 జన్మస్థానసంస్మృతి

చంపకమాల

స్మరణకువచ్చుచుండె మన చక్కనిగ్రామము కొండలన్
[గనన్,
నరహరి కీర్తికాంతులను నల్గడలన్ ధవళాగ్రి మెంతయున్
బరువుచునుండెఁ, బాండవుల పర్వతపంక్తినిజూడు దాని ద
గ్గరవిలసిల్లు నాచెఱువుగట్టున హాయిగఁ జల్లగాలికిన్
దిరుగుచునుండ మే, మఱియుఁ దీయని మామిడితోఁటకా
[వలన్
గరువునకేగి యల్లమునగాలగిరుల్ వడినెక్కుచుండ మే,
యారయమె యింక నుత్తరమునందున నొప్పెడు కొండ
[లల్లవే
వరుసగ నీలమేఘము నభంబునకంటెడు పోల్కి లేచెడున్;

గరముసమీపమున మనసె కన్పడుచున్నవి నిబ్బరంబుగా
పరగుననేగుచో మనముసంజకుపూర్వమె చేరమాయనన్.

## 20 ప్రత్యక్షము

—:0:—

ఆ. "అనుదినంబు నీమనంబును మలయుచు
నుండువాఁడ నాదు నుదధి! యొక్క
పరిభవత్స్వరూప ప్రత్యక్ష మొనఁగూర్చు
తొల్లి రామునకును దోఁచినట్లు." 1

తే. అనుచు నే నొకలలిత దినాంతమందు
జలధితీరవిహారమున్ సలుపుచుండి,
వెలయువారిధిఁ గూరిచి విన్నవింప
దానివిని వార్ధి యిట్టు లుత్తర మొసంగె. 2

తే. "అల్ల రాముఁడు క్రుద్ధుఁడై యమ్ముఁబన్ని
విడుతునంచును నామదిబెగడుఁ గొలిపె
నీవు చేసెడిదేమొ నాకెఱుఁగ పఱతు
వేనిఁ జూపించువాఁడ నాయొసఁగు రూపు." 3

తే. దాని విని నే వచించితి "నేను నిన్ను
నిష్ఠురములాడి నొప్పింప నేర్తు, నీదు

రూప మిప్పుడు నాకిటఁ జూపకున్న
నెఱుఁగవా? నేను చిన్నప్పె యెఱుఁగువాఁడ."

కం. "తనువున విఱిగిన యమ్ములు
ననువునఁ బుచ్చంగ వచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె" యనుచున్

సీ. ఈశ్వరుండు కుడువ నిడితివి బడబాగ్ని
నాపని ఘోరమౌ పాపమందుఁ
ఐందురుఁ డేరీతి జరగింప జరగుదు
నీకుమారున కీవు లోకువందు
నంబరచాయల బింబించు చుందువు
నీ వర్ణములు నీవి కావటందు
భూమిని సతతంబు మోదుకొందువు నీదు
వర్తనం బంతయు భంగమందు

గీ. జడధి! నీ జలం బుప్పుకషం బటందు
నీవు చేపకు మొసలికి నిలయ వందు
నెనఁగు నీపక్క నుత్తగండిగాను కటందు
ననుచు బెదరించితిని దాని కడలి యేమొ. 8

సీ. బెళుకు చేపలఁ బోని తళుకు లీనుచు నున్న
చూపుల నివ్వాళిఁ జూపువారు

తాఁబేటిచిప్పలు నాఁ బోలు చుండెడు
మోకాళ్లపైఁబడి మ్రొక్కువారు
శైవాలమునకును సరివచ్చు కురుల నొ
ప్పారు శిరమ్ములు వంచువారు
అనిలంపు మ్రోఁతల కెనవచ్చు చుండెడు
స్వరములభజనంబు సలుపువారు.

తే. అంబరస్పర్శచే గ్గైనఁగనొప్పు
నడుముతోడ విధేయతల్ నడుపువార
లెంద ఱెందఱో చుట్టు నమందగతుల
నేగుదెంచుచు సేవల నిడుచు నుండ.

సీ. హైమనైర్మల్యంబు లమలంపు మోమునఁ
బోలుపాఱఁ బొంగుపవ్రిపూతగంగ
పెద్దవజ్రపుఁగాంతి నిద్దంపుఁజెక్కిళ్ల
మెఱయువచ్చెడు గౌతమీఝరంబు
ఘనవేణిమురిపెంపు లనువైనకటిపైని
నసియాడ నరుదెంచు నల్లకృష్ణ
చుఱుకైన నడకలు వరపదమ్ములమ్రోయఁ
బింపిల్లు గూయుచుఁ గావేరియేరు

తే. చిత్రగతులను జూపుచుఁ జెలు వెలర్చ
నేగుదెంచు తక్కఁగల నదీగణమ్ము

రంగ దంచితశృంగారరసము లొలుక
సరసఁ దగఁజేరి తగుపరిచర్య సలుప.

సీ. కనుఁలబంధువ సేయుఘనదేహరుచితోడ
గంభీరమగు శంఖగళముతోడ
చలఁగుగాలి కెగురు చేలపింజెముతోడ
రహినాడు రత్నహారంబుతోడ
జగతి కదృష్టమై నెగడుఁజెందముతోడ
నురుభారమూను పేరురముతోడ
శవణించుడిండీర ధవళహాసముతోడ
విలసిల్లు పవడంపుఁ బెదవితోడ

తే. కనకపూర్వపూరుష రూపమును ధరించి
స్త్రీయహస్తముల్ ముత్తెపుచిప్పలట్లు
మోడ్చి నమ్రీభావమ్ములు పొదల నాదు
మోలిఁ బ్రత్యక్ష మయ్యె సముద్రి మహాహా!

తే. వాని కనుసంత నాకొక్కవరుస మదిని
విస్మయము భక్తి సంతృప్తి వేడ్కలమరఁ
బలుకసాగితి నీల్గాఁగుఁ బలుకఁదగదొ
మనలముందు వినమ్రులై ఘనులు నిలువ?

సీ. ధవళచంద్రునివెల్లకవణంబు గాఁజేసి
యీవునఁరగలతోడఁ దృష్టి కంటి
తీయని యమృతంబు దివిజులకర్పించి
యీవుప్పుతోడను నెసఁగుచుంటి

ఐరావతోచ్చైశ్శ్రవాదు లిందుశ్రీన కిచ్చి
యీవు చేపలతోడ నింపుఁగంటి
కౌస్తుభలక్ష్ములఁ గమలాక్షునకు నంపి
నీవు నత్తలతోడ నెగడుచుంటి
తే. విపుడు నీఘనత్వంబు నాకిచ్చి యిట్లు
నీవు నమ్రతతో ముందు నిల్చియుంటి
వార! నిను కొనియాడంగ నగునె నాకు
ననుచు గనులు మొగిడ్చి సాష్టాంగపడితి
కం. పడి లేచి చూడ నప్పురు
షుఁడు మాయంబాయెను. నెసఁ జోద్యము మిగులన్
బొడమఁగ నచ్చోటను బసఁ
పడి కనుఁగొనఁగలిగి చూడ నార్తివ్యాప్తిన్. 12
చ. లలితవినీలకాంతులు తలంబున
బింబిత మౌచునుండఁగా
జలములు గాలికిన్ జెదరి చల్లనిబిందువు లై
స్పృశింపఁగా
నలలొగిఁ జుట్టి వచ్చుచు రయమ్మునఁ దీరముఁ
దాకి మ్రోయఁగా
నలఘుసముద్రమయ్యె మఱి నాతఁడహో! యని
లోన నెంచితిన్. 13

# 21 చిన్ని లోకమా!

---

ఉత్సాహము

అచ్చెరువుగ నాకసమున నర్బుదాలు నిర్బుదాల్
రెచ్చుచుండి యుడుగణమ్ము రేయి నెల్ల శాంతమున్
బుచ్చుచున్నఁగాని, వేఁగు పొడమఁ జిన్నిలోకమా!
తెచ్చుకొనెద వేల చింత తెగనికలహమోదివై?
అంతరములు కొలుపుచున్న నాత్మ ధర్మ మెంచుచున్
బంతగింప నుడుగణమ్ముపైని రాతి రంతయున్
గాంతిలినను గాని వేఁగు కాఁగఁ జిన్నిలోకమా!
యెంతొ యీర్ష్యఁ జివికె దేల తృప్తిరహితభావివై?
పొనుపుఁ గుర్రింకపాటు లున్నఁ బొడిచి గుర్రింకువఱకునున్
గడుసహించి నిజరహస్య గాన తన్మయమ్మునం
దుడుగణమ్ము పూవు నెల్ల నొక్కతీరు మింటిపై
మిడుఁగు మన్న కాని వేఁగు మాఱఁ జిన్నిలోకమా!
పడెద వేల దిగులు నీవు ప్రతిత్రుటి న్నిరాశవై

---

## 22 అంబుదంబ!

—:o:—

### గీతమాలిక

అనుజులను గూడి యొక యపరాహ్ణమందుఁ
గాపవరపుఁ దటాకపు మేపులందు
వాజులన్ బట్టుకొనుచు సవారిఁ దీయు
చుండఁ గాంచితి నిన్ను దిఙ్మండలమునఁ; 1

బొరలి వచ్చెడు వారిధి పోననంగ
నొక్క నిమిషమ్ములోన మే మక్కజపడ
గాలితో వ్యాప్తవైతి వాకాసమంత,
యెంతొ వర్షింతు వనఁబోతి వంతలోనె. 2

అనఁగు వెనువెంట నొండు సాయంతనమున
జీవర మునగాలకొండపై చింతకొమ్మ
నెక్కి కాయల నూపుచు నెక్కసక్కి
యములఁ బొద్దును బుచ్చెడు నవసరమున; 3

నలసిపోయిన సాంధ్యార్కు నందుకొనెదు
నపర దిక్సతి చెలువంపు హాస్యయుగళి
మెఱయు చుండెడు హురుముంజి మెత్తలనఁగఁ

బఱుగు నిన్గంటిఁ గన్నులబండువుగను. 3

నిదుర లేచుచు నే నొక్క యుదయమందు
నూతనోత్ఫుల్ల పద్మవినోదమైన
కొలఁకునను దోనెఁ ద్రోయుచుఁ గుసుమములను
బొదువు చెడకుండఁ గొనగోటఁ బుణుకుచుండఁ ; 4

బ్రిద్ధిశాచల దేవళద్వారమునకు
నడ్డముగ వేయు తామ్రింపుకడ్డి యనఁగ
వెలయుచుండెడు నినుఁ జూచి తెలిపినాఁడ
గట్టుపై నున్నవారల నట్టె పిలచి. 6

జోకమగు తోఁటనొప్పెడు పాఁకలోన
నంటుమామిడిపండ్లను నాహరించి
యపుడెయే తాము త్రొక్కిన నలసియున్న
పాలికాఁపులతో వింత పలుకుచుండ ; 7

నరములను మెఱుపులను మహోగ్రవృత్తి
నిలిచి పిడుఁగుల వడగండ్లఁ గలసి యొక్క
యేకధారగఁ గురిసితి వెంతొసేపు
ప్రళయమే ముంచుకొనుచును వచ్చెననఁగ. 8

జాముప్రొద్దుండగాఁ గళాశాల విడిచి
గౌతమీతీరమందునఁ గౌతుకమునఁ
బడవలను బండ్లఁ జూచుచు నడచుచుండ;

వం తెనకుఁ బైనిఁ గనఁబడు పర్వతముల 9
మేఁత మేయంగ దిగు నాలవో తనంగ
వెల్లవన్నెలతో నీవు విశ్రమింపఁ
గాంచితిని నేను, మఱియును గాంచి వ్రాసె
మేలురంగుల పటము నా మేనమామ. 10
అల్లనీలంపుఁదలమున నంచునందుఁ
బొడముచుండెడు ఫేనంబు బోవ్రుసేసి
దరికిఁ జేర్చుచునుండెడు కెరటములను
గనుచుఁ దిరుగాడు చుండంగఁ గడలిపైనిఁ 11
గంటి నిన్నొక్కవేళ విఖ్యాతమైన
యింద్రధనువును దాలిచి యెనఁగుచుండ;
యూధి నుత్తర దక్షిణధ్రువములందుఁ
గలుప రంగులవంపును నిలిపి తనఁగఁ. 12
జమవుకొనుచును నే నున్న గదికి ముందు
నల్లుకొను సన్నజాజులవల్లిఁ జూచి
నడుమ నడుమను సమ్ముదపడుచు నుండ
నొక్కవాసర మెల్ల నీ వొక్కతీరు 13
గట్టి యాకసమునఁ జిల్లుపుట్టె ననఁగ
ముసురు కల్గించితివి కడు విసుకు పుట్టి.
మఱియు నీ రేయి మేడపై మలయ పవన

లలితపోతమ్ములకు సంతసిలుచు మేము 14
ముచ్చటించుచు నుండంగ వచ్చి యహహా!
యెంచికట్టిన సంచిసి నుంచు రీతి
దాచుచుంటివి చంద్రుని తళుకు చుండి.

యెంత మేత్రైన నీవాత్రిమింతు వెట్టి 15
వన్నెల నయినఁ జూపింతు వెన్న నేల?
అంబుదంబ! ఆ రవిశశిబింబశోభి
తాంబరంబెల్ల రాజమార్గంబు నీకు!

---

## 23 ధ్రువబుద్ధి

---

ఉ. తల్లిరో!యట్టులుల్లమునఁదల్లడమందుచు, లేగదూఁడపో
గొల్లఁడు వెట్టియై నెమకు కూరిమిఁ జూపుచు వన్యభూ
[ములం
దెల్లెడఁగ గ్లుతొట్రునడ నేటికిఁద్రిమ్మరుచుంటివమ్మ! నీ
పిల్లఁడు తప్పిపోయెనో కో! పెంచిన నీ హృదయంబు
[నొవ్వఁగన్ 1

చ. అగునని చెప్పలేక యతి వా! చెఱఁగశ్రుల నొత్త
[గొంతులో
బొగులుచుగద్గదంపడఁగఁ బోవుచునుంటివనీదుత్రోవనా
కొగిమఱువల్కకుండగ నెయొంటిగ నెందులకేగెదమ్మ! ఫూ
ర్తిగ నెఱిఁగించువాఁడనొక తెన్నునాతనిఁజూచివచ్చితిన్.

చ. దిటమగునూడలన్ భువికి దింపి సుదీర్ఘపుశాఖరాజి ది
క్తటములఁజాపి దట్టముగఁ గప్పెడునాకుల చల్లగాలి నం
తట వెదజల్లి పక్షికలనాదమనోహర శారివ్యరాజిఁ బ్రా
కటమయిమొప్పుపాక్ర్వటఁపుగాఁటపునీడలచల్వపట్టులన్

ఉ. కావిడుకూలపుంగొన వికాసము పాడుకనాడఁదంబుఱన్
దీవెలు వేర్లమీటి యొకతీయని సుశ్రుతిమేళవించి స
ద్భావనలుప్పతిల్లగను పాడెడు మౌనివరేణ్యు సన్నిధిన్
బావనశీలు నీసుతుని బాలునిఁగంటిని వీనులొగ్గగన్. 4

మ. ఉపదేశంబునుభక్తిపూర్వకముగాను త్సాహినై బాల
[కుం
డు-పఠింపగనుబూనియుంటనతనిన్ లోలుండనై యేటి కీ
యుపహాసాస్పదమాక్షిరక్తికడు బాల్యంబందె చేకొందువం
చు, పరీక్షింపఁగనైతినీతనయుఁడా? చూడంగ నౌనమ్మరో!

ఉ. అక్కడెయింకనుండుకొకొ యక్కడనుండి మత్రొంకు
[చాయలన్

ద్రాక్షాచరిత్రాస్త్రి! చూపట్టలకుఁదోపచేయుచోట్లుఁ
[బాసియుంచు రే

పత్రికాకుటీరులరో పరిసరంపుపథంబులనున్న వారితో
నిక్కమెఱింగి నేర్చొదగు నిశ్చలచిత్తుని సీమపుత్రికన్. 6

సీ. చిగురుటాకులగుజ్జు జిగికెంపుచెదరించు
కోయిలకూతలన్ గొసరుఁబంచి
మాగెడుఫలరాజిమధురంబుఁ జిలుకకీ
రంబులపలుకు నర్థము ఘటించి
లలితంపుఁబొదరింటిపూలరుల వలపించు
గువ్వలకువకువన్ గూర్మి పెంచి
అల్లికగూటియుయ్యెలతీవ నూగించు
పిచ్చుకముచ్చట లెచ్చరించి

గీ. సృష్టిసంతతస్వాదుసద్గోష్ఠిదగిలి
మౌనిశేఖరుఁ డతులనిర్మలత వెలయు
నిందె విహరించు చెంద మానందమొందఁ
గానరా డిప్పుడిప్పుడె కానఁబడియు.

శా. ఆయోగీంద్రుఁడు నేత్రపర్వముగ నిత్యంబిందువీక్షించు
[చుం

డాయాచాయలుకొత్తశిష్యునకునభ్యాసంబులానంచుస

త్యాయత్తాత్మకు నీవు పుత్రికుని గాంతారంబునన్ దిప్పి
[ప్పున
ట్లోయమ్మా! స్ఫురియించు నెమ్మదికి నాలోకింతమప్పట్టి
[లన్.

క. అటుపో! అల్లపొలంపు రేవడిని జోడై యొప్పు రెండెడ్లనా
గటికిన్ గట్టికృషీవలుండొకఁడు చెక్కన్ దున్ని చేన్ జల్లివం
డుట యెన్నండని రేల్ బవల్ పలుకఁదోడున్ లేక కాపుండున
చ్చోటకున్ బోయి కనుంగొనన్ దొరకు నీసూనుండు
[యోగీశుతోన్. 9

ఆ. "తండ్రితనకు నేను తనయుండనను పేరిచు
ననుభవింపఁబోలము నప్పగించెఁ
బొద్దుసంజ నాదుబొమముడి చెమటూర
కాలమానములను గణనఁజేసి

ఆ. దున్నిగింజసల్లి కన్నడ సేయక
కాచుకొనుచు వానజూచుకొనుచు
పంటపంటఁ బొట్టనిండించుకొనుచుఁను
నిన్నియేండ్లనుండి యిందెయుంటి.

ఆ. ఒడలిపాటవమున కోపికసమకూర్చి
పడెడువానవాలు వడుపునెఱిఁగి

కృషిని జేసికొన్నఁ గీడేలకలుగునో
యనెడుసూత్రమును దృఢాత్మఁదలతు." 12

చం. అనియెడు వాని పల్కులను నమ్మరొ! నీవు వినంగ [నేరవో
ఘనమగు నమ్మనీందుఁ దలకాపును బ్రశ్నము వేసి [చెప్పమం
చన బదులాడుచుండెను సుమా? త్వరబోదము వారి [జూడఁగన్
వినఁగను నాకునెమ్మదిని వేడుకపుట్టెనువింత హెచ్చెడున్.

తే. అయ్యో? యిప్పుడే హాళికు నరసి యన్నె
యుత్తరపు దిక్కుగా నేగియుండు రంచుఁ
జాటుచున్నవి చిన్నెలు బాట పొడవు
వారి నీనాఁడు చూడక వదల వలదు. 14

చ. కనుఁగొను మల్లవాఁగున నొకానొక తెప్పనుగట్టిపల్లె జ
వ్వని యొక తెప్పదుందరికి వచ్చుచుఁబోయెను వారలెల్లదా
టను గడఁబూనిపూనికనడాసుచునుండును నాపె యొద్దకున్
మౌనిపలుమాఱుఁబోయి కథముచ్చటలాడుటఁగంటిచూ [తమా. 16

ఉత్సాహము

"కొండకాల్వ! యెంత నీవు గొప్పదాట్లు వైచినన్

దండ నాడుగడను నిల్పి తగినతీరు నడుపుచోఁ
నుండకున్నె యిట్టు నటుల నూగునే యటంచు ను
ద్దండవృత్తినడుపు దాన దరికి దరికిఁ బడవలన్. 16

దాటఁగోర్కెకలిగి యొడ్డుదాపునకును వచ్చుచున్
బాటవమున జాలువాఱువాఁగునకును బెదర కీ
నాటివఱకు వచ్చినట్టి నరుల జంతుజాలమున్
దాటునట్లు చేసియుంటి దాన ముదమునొందుచున్. 17

తనకు లాభ ముండకున్న ధరను నన్యు లుపకృతిన్
మనలనుండి కోరుచున్న మానక యొనగూర్ప నా
ననెడునూత్రి మెదఁదలంచి యంబుల మునుఁగంగనా
జనుల నీఁది పైకిఁ దీసి సలుపుమఁ బరిచర్యలన్. 18

గీ. అనెడు నల్లమానిని వాక్కు నాలకించు
మమ్మునింద్రుఁడు నీసుతుఁ డది యెఱుంగఁ
దెలియఁ జెప్పంగఁ జేయు నాలలన చేత
రమ్మి యిచ్చుట కెంతో దూరమ్ము లేదు. 19

తే. అక్కటా! యాదరి నావ నదిగొ! దాటి
సాగుచున్నార లప్పుడే; యేగిచూత
మల్లపడవ యీప్రక్కకు మళ్లి రాగ
నెక్కిపోదము జననిరో! యక్కజముగు. 20

మ. కనుచూపున్ గొనరించి కానఁబడు నాఖండంబునందొ [ప్పొ ప
చ్చనిమేపున్ బశువుల్ దినాంశమునకిచ్చన్ మేయుచుం [డంగ శ్రీ
ధ్ధను గాపాడుచు వేణునాదకలితసంధాన ప్రీతిధ్యానమున్
దనివిన్ జెందెడు గోపబాలకుల చెంతన్ జూడఁగన్పించరే."

మత్తకోకిల

"గొఱ్ఱెలన్ మఱి మేఁకలన్ మఱి గోవులన్ మఱిగిత్తలన్
వెఱ్ఱిగొల్లల మాచు నిష్టుల వెంటఁదోలుక వచ్చుచున్
గట్టికంపలఁ గొట్టుకొంచును గంజికూడు భుజించుచున్
బఱ్ఱపచ్చికలందు దొర్లుచుం దార మొంతయుఁ దృష్టితోన్
ఒక్కటొక్కటిగాఁ జదువుచు నూహ నేర్వని యీపశుల్
జక్క నొక్కటిగా నొనర్చుచు సాకుచుంట నిదానమై
మక్కువన్ గడుజాలిగొల్పెడి మానసంబుల నిల్పి చీ
చక్కిలోఁ దిరుగాడఁ జేసెడు సర్వదా మునిపుంగవా!"

కం. అని ప్రత్యుత్తర మిడు భా
షణములు వినఁబడెడు నవిగొ స్పష్టములగుచున్
గనుఁగొనఁగ బాలమునిముఁ
గనఁబడుదురొ కానఁబడరొ కనుఁగొనన యెడున్.

తే. అకట! లేరింకఁగూడని రాకయయ్యొ
మఱలి పోదమటంచునా? మాత! దైవ!

యేమొ కనుఁగొంద మాకొండ నెక్కి కొంత
మేఱ యచ్చోట నెవ్వరో మెలఁగుచుండిరి.

సీ. కోయలుకొండవారచటఁగొందఱుకాపురముండి కొండ
[కుస్

సాయములేక వచ్చి పథికవ్రాతముతప్పి విచారమందు వా
రేయెడఁ గానిపించినను నిక్కడ మార్గమటంచుఁ జెప్పియా
ప్యాయము మీఱఁబంక్తినిడి పంపుచునుందురు వారిపట్ల
[కుస్.

ద్విరదగతిరగడ

"పుట్టినప్పటినుండి భూధరస్వామి
మెట్టి దిట్టల మగుచు మేదినిగామి
తార్థంబులవి యెల్ల జూచియుండినను చ్చు
స్వార్థమెంచక స్వేచ్ఛ సంచారములఁ బుచ్చు
చుందుమే యెల్లప్పు డొంటిగాడుమట్టి
విందొనర్చెదు పక్షివింత ఘాస్యముఁగొట్టి
క్షుత్తు తీర్చెదు తీర్థగానము మేమిచ్చోట
నెత్తైనగిరు లెక్కియుండ నిక్కని బాట
దారితప్పినజనుల దారి తిన్నఁగఁదీసి
వారికాతిథ్యంబు పచరించుచును వాసిఁ
గాలముస్ గడపు టే ఘనమంచు మదినెంచి
యేలఁబ్రశ్నించెదో యీరీతి మముఁగాంచి?"

చం. అన మునివాక్యదుత్తరము లాజనులాడెదు పల్కు లెల్లఘ
మ్మనగిరిగహ్వరమ్ములను మ్రోసెడు వేబ్రతిశబ్దమీను చిం
కను తెలియంగనేరమ? కనందగు నీచజినంటి యెక్కచో
వినబడువారిభాషణము వెంట నె నెమ్మది నోర్చు తార్చుచో 30

మ. అకటా! యెక్కఁగనేర మిప్పటికె యాయాసంబు [మెండయ్యె న
య్యకలంకుండగు మాని బాలకునితో నత్యున్నతంబైన కొం
డకొసన్ వేగమ యెట్టులెక్కెనొ కొ చూడం బోలు నా వారలీ
సకలక్షోణివిలోకనాద్భుతమునన్ సంతుష్టులై యుందురే.

కం. మనమింక నెక్కనేరము
కనుగొలఁకుల జాఱు బాష్పకణములు పోవన్
వినవచ్చు వారిపలుకుల
వినవమ్మా! యుండెయుండి విమలతపస్విన్.

ఉ. బాలక! యింతవట్టునకు వచ్చినమార్గమునందుఁ జూపునా
లీలలు సంగ్రహించితివొ లేవొ యెఱుంగదలంచుచుంటి నీ
శీలము స్పష్టమౌ కరణిఁ జెప్పుము, కాంచుచు విన్నవాఁడవా
హాళికుఁ బల్లెజవ్వనిని నాపయి గొల్లలఁ గోయవారలన్?

ు. నుదుటఁ జెమ్మట చిమ్మ నుదయాస్తమయములు
హాలము చేపట్టెడు హాళికుండు
దండలు గడిఁదేఱ నిండుజలంబుల
బడవనుగడ వేయు పల్లెపడఁతి

కాళ్లుకాయలుగాయ కాననభూముల
గోగణంబులగాయు గోపకుండు
గొంతు బొంగురువోవ గుహలంటి గిరు లంటి
విగతమార్గస్థులఁ బిలచుకోయఁ 35

డెడఁదలం దొక్కయుద్దేశ్య మినుమడించి
మేఱ యయ్యది తమకనుమితి నెత్తింగి
తృప్తివడి నిచ్చ ముదములఁ దేలుచుండు
రట్లు జీవింప నేర్తురే యంబఱవని? 35

ఛం. కనుగొనుమదిగో కిపెడనుగాంచినదాఁక నొకేవిధంబుగన్
ఘనఘనగాఢనీలపరికల్పితవర్ణము, మారుతప్రతి
స్వనము తరంగతాడితవిచంచలఫేనము మీఱునూగుని
వ్వననిధిపైఁ బ్రియాణు లగువారల నెల్లఱ నాదు
[బాలకా! 36

ఉ. వారికి నొక్కతోవ కనుపట్టదు వాయువులెట్లు వీవ,నా
దారినిఁ బట్టి సాగెదరు; దండిఁ జెలంగెడుభంగఘట్టనన్
గోరినవాని వీడుదురు; కొండొకము త్రైముతళ్కు లీనుచో
బోరన నందఱాదరికిఁబోయి మునింగెడువారుపోరునన్ 37

ఉ. ఏకమతంబు లేక మదినింద్రియవాంఛలఁ బంచివంచి, ని
త్యాకులులై యమర్త్యపరిహాసపుఁ బాత్రులరై చిరా
[యువున్
జేకురుపూర్ణసౌఖ్యములఁ జెందఁగ నేరక చూచుచుండఁగా
నేకడ నో విషాదమున నీగ్లెడువారలు నిర్మలాత్ముఁడా! 38

ఉ. నీ వొకపిన్నపాపఁడవు నిష్కలుషాత్ముఁడ వట్టినీవు నా
త్రోవను నొక్కడాసికనుదోయికి నిబ్బరమంచు నెంచి లో
భావనఁ జేసికొన్న మనవచ్చును నిశ్చయము, నీదు కాంతియే
త్రోవను జూపుఁ దజ్జలధిరోదన వేదనఁ బొందువారికిన్ 39

మ. భవదీయధ్రువబుద్ధి యీగిరిపయిన్ భాసిల్ల నెవ్వారుని
న్నవలోకింపఁగఁ గోరుచుండెదరు నిన్నాదర్శనీయంబుగా
సువిచారుల్ మునిముఖ్యులెంచెదరు దిక్ప్రోద్యంబ వై
[యుందు నీ
కవలన్ వెల్గెడు జ్యోతి కానఁబడదే యం దెంత యా
[సించినన్ 40

చ. అని యదె మాయమయ్యె మునియాత్మజు తేజము పర్వ
[తంబుపై
వినుతప్రకాశముల్ గొలిపి పింతగ వెల్గెడుఁ గాంచుమమ్మరో!
వసరకుమమ్మ! పోవ దిఁక భాసురలీలను శాశ్వతంబుగన్
దనరెడు నెల్లవారలకు తానె నిదర్శియటంచుఁ దెల్పుచున్

చ. అతనికిమిత్రిలేదు మనకందఱకుండెను, నేలయందువో
మతి నతఁడొక్కయాశయము మన్ననఁజేసి చెలంగువాఁ
[డు; సం
తతమునుజీవితుంచు సుమ ధారుణి మానవులెల్లవేనవేల్
మతములబూనుచున్విఫలమానసులైనశియింతురమ్మరో!

---

## 24 కల

---

ఆ. బండియొకటి యిటకువచ్చె మాయూరిది
వెళ్లుచుంటి నిపుడె వెళ్లుచుంటి
ననుచు సంభ్రమమున నమ్మమ్మతోఁ జెప్పి
పయనమైనవాఁడ బండినెక్కి. 1

ఆ. మధ్యమధ్య బండి మందంబుగాఁ బోవ
బండివాని లేపి పంపుకొనకు
తోలుతోలు మనుచుఁ దొందఱ పెట్టంగఁ
జేరి నార మూరు చేరువునకు. 2

క. ఆసరికి వేఁగుజుక్కయు
భాసిల్లుచు నుదయ మందేఁ బవ్వము విడిచెన్

గూసెడుఁ గోళ్ళొకటొక్కటి
వేసెడుఁ జలిగాలి గిరుల విచ్చలవిడిగన్. 4

చ. చలియిటఁ దూరునాయనుచుజంటపొరల్ కల పెద్దదుప్పటిన్
దలపయినుండి పాదములదాఁకనుగట్టిగఁగప్పి కిర్రిచె
ప్పులధ్వని సేయుచున్ నడుమముల్ కలకట్టఁను నేలఁగొట్టుచున్
బొలమునఁగుప్పనూర్చుకొనఁబోవు కృషీవలునొంటిఁ
[గాంచితిన్. 4

క. కుప్పలకడఁ గాపుండెడు
నప్పాలేరులు చలికిఁకనాగఁగ లేఁకే
చొప్పనొ కూర్చుచు మంటల
నొప్పఁగ వేసి చలిఁ గాగుచుండుటఁ గంటిన్. 5

ఉ. బందము చేతఁబట్టుకొని పాల్పితుకంగను వెళ్లుగొల్లనిన్
బొందుగఁ దూడలన్ గదలిపోవకయుండఁగఁ బట్టుపిల్లనిన్
దొండఱతోడ గోవులను దోలఁగ మేల్కొను పాలి కాఁపుమా
నందునఁబోవుటల్ కనుచు సంతస మెచ్చఁగ బల్కరించితిన్.

మ. అహాహాయింటిని జేరితల్పుని దెబామ్మాతీయుమాయన్న దా
ఁన హహహా, యంచును లేచివచ్చి యెవరో కొక్కొయంచు వేఁ
[దీసి వ
న్నొహహో హెహో, యంచునులోనికింబిలిచెనే మోయన్నెపై తె
[ల్లౌ తెడుస్
తహిఁ దెల్లా తెనటంచు లేచితినిసర్వంబంత మాయంబ మెన్.

# 25 ఏ ఱుఁ గ రా ని

—:0:—

ఆ.వె. నాదుతోఁటలోని లేఁదీవ మృదులంపుఁ
గెంపుఁజివురుతోడుఁగు సొంపుఁ గాంచి
యేటి కిద్ది యనుచు నెంచితి మదిలోనఁ
గాని యహాహా! యెఱుఁగరాని యొక్క
నీలమేఘమాల నిబిడంబుగా మూసి
చల్లనైనవాన యల్లఁజిలికె;
నాదు తీవ మిగుల మోదంబు నుప్పొంగి
శిరము వంచి యెత్తి కెరలి యాడె.
నాదుతోఁటలోని లేఁదేవ నునుమొగ్గఁ
గులుకుచుంటఁగాంచి తలఁచితి నది
యేటి కనుచుగాని యేమనిచెప్పుదు
తెలియరాని యొక్క మలయపవన
మల్లరేకుకంట మెల్లన వీచుచు
వలపుఁ జిమ్మె నాల్గువైపులకును;
నాదుతీవ మిగుల మోదంబు నుప్పొంగి
పూలచామరములు లీల విసరె.
నాదు తోఁటలోనిలేఁదీవ ఫలముల

106 — 6

వ్రేలుచుంటఁ గాంచి యేటికంటెఁ
గాని మెఱుఁగరానికరపద్మ మొక్కఁడు
రాలఁ జేసి పీల్చె రసము లెల్ల;
నాఱుతీవ మిగుల మోదంబు నుప్పొంగి
విత్తనముల నార వృద్ధిఁగాంచె.

సంపూర్ణము.